ఆంధ్ర ప్రకృతిధర్మ పరిషత్ ప్రచురణములు.

# వర్ణవైద్య మంజరి

డాక్టరు ఈ. డి. బాబిట్, యం. డి. యల్. యల్. డి. గారి

Health and Power కు తెలుగు.

గ్రంథకర్త:
డా॥ పుచ్చా వెంకటరామయ్యగారు.

ఆంధ్ర ప్రకృతిధర్మ పరిషత్, బెజవాడ.

2వ కూర్పు 500 ప్రతులు.



వెల 0-6-0.

# వర్ణవైద్యమంజరి



1. స్థూలశక్తులు: సూక్ష్మశక్తులు:- కాంతశక్తితో చేయు స్పర్శన, సూర్యకిరణోపయోగము, వర్ణశక్తి, విద్యుచ్ఛక్తి, సైనూపప్యోషధవిధానము, మానసికవిధానములు — యివి సూక్ష్మశక్తులు. అవిరి, నీరు, గాలి, యివి స్వయముగాసూక్ష్మశక్తులు. కాకపోయినను అవి సూక్ష్మశక్తి వాహకములై యున్నవి.

2. వర్ణౌషధములు:- రంగుసీసాలలోనుంచి యెండలోనుంచిన నీరే మందగును. 2 పెద్దచెమ్చాల నీరొకమోతాదు. పచ్చసీసాలోపోసి యెండలోనుంచిన నీరు పీతోదకమనియు; ఇట్లే నీలివర్ణోదకపు సీసాలోని వానికి శ్యామోదకమనియు, యిట్లే ధూమ్రోదకము, రక్తోదకమనియు వాడుదురు. శ్యామోదకము చలువజేయును. బాధోపశమనకరము. వాపులను చల్లఁబఱచును. మంటలు, ఫేనులు, గ్రహణి మొదలగువానిం గుదుర్చును. రక్తోదకము రక్తమునకుద్దీపన గలిగించును. ధూమ్రోదకము అజీర్ణాదులనుబోనడచును. విశేషవివరములకు వెనుకటిభాగము చూడుడు.

3. అతిమూత్రము.- అధికముగా మూత్రము వెడలుటయు నం దధికముగా తియ్యదనముండుటయును. ఇది సాధారణముగా నసాధ్యముగా భావింపబడుచున్నది. కింది సమాధాన

లను, చక్కెరపదార్థములను తగ్గించి తినవలెను. తవుడు పదార్థములను ఎక్కువగా తినవలెను. వెన్నుపాము పైపసుపుపచ్చ కాంతిని ప్రసరింపఁజేయ వలెను. పీలుగానున్న మర్దనముతో గూడ ఊదాకాంతిని ప్రసరింపఁజేయ వచ్చును. పీతోదక ముద యమునను, శ్యామోదకము సాయంత్రమునను త్రాగుటచే 79 సంవత్సరముల వృద్ధున కతిమూత్రవ్యాధి నిమ్మళించినది.

4. అతిసారము:— తేపకు 1,2 గ్రుక్కలు శ్యామోదకము త్రాగునది. అన్నిమందులు నిరుపయోగమైన విషయములో నిది యుపయోగించినది. మిక్కిలి తీవ్రముగానున్న యెడల నిట్లు ప్రతిగంటకును త్రాగునది. ఇదియును ప్రయోజనకారి గానిచో నీలిసీనాలోనుంచి యెండలో నెండించిన పాలుకొద్దికొద్ది గా లోనికిచ్చునది. కటిప్రదేశమున యెడమనైపున పైకిని కుడి నైపున క్రిందికిని రుద్దుటయును ప్రయోజనకరమే.

5. గ్రహణికి సయితే మిదియే చికిత్స. అసనమునుండి రక్తము పడునుగాన నీలిసు శ్యామోదకముతో యెనిమా చేయుట మంచిది.

6. అసృగ్దర:— ఋతుమతి కాదగిన కాలమునకు ముందు గా ప్రతిపదవ, కేంద్రీకృతనీలమును రెండు గర్భాశయముల (ovaries) మీదను ప్రయోగింపవలెను. ఇట్లు 2, 3 తడవలు చేసిన యెడల అత్యాశ్చర్యముగు చేయుకలుగును.

7. అంగవికృతి:—తల ఒక సిటకినొట్టెనిమీదను ... గుంట,శిరఃపృష్టము, వెన్నుపాము... నిమీద 105 115 ...

వేడిగల నీటిని పోయవలెను. ఇది గారడివలె పనిచేయును. ముఖము మీదను, కణతలమీదను చన్నీరు పోయవచ్చును. మంచుగడ్డ శిరస్సువెనుక భాగమునకు వాడరాదు. వడదెబ్బకు గూడా యిదియేచికిత్స.

8. అటలమ్మ: పొంగు:— లోపలనున్న మాలిన్యము (virus) బయటికి వచ్చుటకుగాను ఆవిరిగాని గోంగళిచుట్టలు గాని చుట్టవలెను. ప్రమాదమంతయు పోయినట్లు తోచిన తరువాత శైత్యమురాకుండునట్లు జాగ్రత్త పడవలెను. దినమునకు 2,3 తూరులు మెర సీసాలోని నీటిని త్రాగవలెను. దీనివలన లోపలి విషము వెలువడి పోవుచు.

9. ఆసువాతము—మేహవాతము:—

అత్యంతము అసహ్యాకరములగు నీ 2 వ్యాధులు ఆదిత్య పేటికతో చేసిన చికిత్సచే సులభముగా కుదురును. రక్తము యొక్క విషమగతి సరళమగును. ఇతరవైద్యములన్నియు దీనివలె పనిచేయవు. మోకాళ్లు అంటుకొనిపోయిన విషయములతో జేర్చి యింతవర కనేకములు చికిత్సింపబడినను ఒక్క విషయమునందైనను అపజయముగలుగలేదని బ్యాబిట్‌గారు వ్రాయుచున్నారు. మొండివానికి యెర్రకాంతి వాడినను, రక్తమునందు చలనము గలిగిన విషయములందు ఊదావర్ణము వాడబడినది. మర్దనచికిత్స చాల గుణయుతమైనది. నగ్నము పైకిచేసినయెడల రక్తనాళికలయందు వృద్ధిపనగలుగును. శోష

యెక్కువగానున్నప్పుడుమాత్ర మొకటిరెండుతూరులు నీలి కాంతి ప్రయోగింప వలసియుండును. మలమోచన మగునట్లు చేయుచుండవలెను. కాలికవ్యాధులయందు దుస్తులకు లోపల యెర్రని ఆస్తరణము (lining అస్తరు) వేయుట మంచిది.

10. ఆరోగ్యము, సమత:- సమతాలోపమే రోగము. దేహమునందు సంకోచ, వ్యాకోచ, శక్తులు రెండు గలవు. సంకోచ శక్తిలోపము వలన తరుణములును, వేడితో గూడినట్టియు రోగములు గలుగును. వ్యాకోచశక్తిలోపము వలన కాలిక మైనట్టియు. చచ్చుతో గూడినట్టియు వ్యాధులు గలుగును. ఇందు సంకోచశక్తిలోపమువలన గలిగిన వ్యాధులకు శీతకరపదార్థములును, వ్యాకోచశక్తిలోపమువలన గలిగిన వ్యాధులకు ఉష్ణకరపదార్థములును సమరసకరములు. ప్రపంచము నందలి శక్తులన్నింటిని రెండురకములుగా విభజింప వచ్చును. సంకోచశక్తులు (Electric Forces) వ్యాకోచ (Thermal Forces) శక్తులు నని. సంకోచశక్తియందలి మోటు (Coarse) స్వభావమే చలి. వ్యాకోచశక్తియందలి మోటు స్వభావమే వేడి. క్షారములు, తియ్యనివి, జలవాయువు (Hydrogen) బొగ్గు, క్రొవ్వుగల యాహారములు, ఆవాలు, మిరియాలు, అల్లము, తల, దేహమునందలి యెడమభాగము, మలకారులు, దేహము కందించునట్లు, చేయునవి, ఆవిరి, వేడి నీరు, వేడిగాలి, ధమనులయందలిశుద్ధరక్తము, స్వేచ్ఛానాడులు, బ్యాటరీయందలియెదుటివైపు(negative pole of the battery) అయస్కాంతముయొక్క దక్షిణపుకొన, ఎఱుపు, నారింజప…

వర్ణము, పసుపురంగు, వెలుగునందలి పసపుతోగూడిన ఆకు పసపు కిరణములు మొదలగువాని నుష్ణశక్తులు ఆవరించుకొని యుండును. ఆమ్లములు, మంచుగడ్డ, చన్నీరు, చలిగాలి, ప్రాణ వాయువు, ఆమ్లయుతములగు ఫలములు, అయస్కాంతము యొక్క ఉత్తరపుకొన, బ్యాటరీయందలి ముందువైపు (Positive pole of the battery) దేహమునందలి కుడివైపు పాదములు, సిరలయందలి అశుద్ధరక్తము, అనిచ్ఛానాడులు, మలబద్ధము గలిగించునట్టివి, చల్లబరచునవి బాధోపశమన కరములు, నీలముతో చేసిన ఆకుపసపురంగు, నీలము, నీలి మందు వర్ణము, ఊదారంగులు శీతశక్తులలోనివి.

11. అహికజ్వరము:— మందువైద్యులకు దీనితత్వమే బోధపడినట్లు తోచదు. ఇందు కొద్దిగా వివరించుటకే సాధ్యమగును. దేహమునందలి శక్తులు యకృత్తునందుండి ప్రచండ వేగముతో తుదలకంట వ్యాపించును. దాన సన్నిహితమగు చర్మతలమున చలిదోచును. అదేసమయమున నుష్ణశక్తులు మొదలగా వ్యాపించునుగాన లోపల నత్యంతమగు నుష్ణముండి విపరీతమగు దాహము గలుగును. అప్పుడు చల్లనినిమ్మనీటి నాటి ఫలోదకము నిచ్చుట కర్జము. శీతశక్తులు తుదలకంట వ్యాపించి వెనుకకుబోవును. అప్పుడు చర్మతలమున అమితమగు జ్వరము గానుపించును. లోపలి శీతలమును బోగొట్టుటకు నోరుపట్టినంత వేడిగల మిరియాలకషాయము త్రాగుట మంచిది. దీనినే రెండు గ్రెయినుల పరిమితిగల మిరియాలవుండ గాగా తినవచ్చును. ఇట్లు 80 మందికి జ్వరమును బోగొట్టి

నా డౌక వైద్యుడు. ఇది ఆహారపదార్థమే యగుటవలన క్వైనా కన్న శ్రేష్ఠతరమైనది. అంగమర్దన, స్నానములు సమర్థత మములైనవి. కాలేయము, యకృత్ మొద్దుబారినపుడు మాత్రమే చలిజ్వరపు శిలీంధ్రములు రక్తమునందు వృద్ధియై రోగమును బెంచును. ఇది తర్జుమాగ్రంథము గనుక మూలమునందున్నది వదలివేయలేదు. మిరియములు జ్వరచికిత్సకు అనవసరములే. జ్వరమును పెంచుననుకొనుచున్న శిలీంధ్రములు రోగముయొక్క తీవ్రతను, రక్తముయొక్క కుళ్లుదనమును మాత్రమే సూచించును.

12. భావోదయము (Suggestion):— భావోదయముచే శాంతముగా మనస్సుయొక్క గతినిమార్చి, రోగముయొక్కయు బాధయొక్కయు, స్థితియొక్కయు లేమిని భావనచేసి, మానసికాత్మీయశక్తులను మేల్కొలుపుటయే మానసిక చికిత్సయందు మిక్కిలి ప్రధానమైన పద్ధతి. సామాన్యమగు మానసికచాంచల్యము కరికట్టి, నిహితమైన సున్నితశక్తులను మేల్కొలిపి వాని బలమును ప్రయోగించినయెడల ఫలితములు నిలుకడగానుండును. ఇది మానసికవిశ్రామ (Hypnosis) కాలమున జరుగును. మానసికశక్తి బాగుగా నభివృద్ధిబొందిన సమర్థుడగు మానసికచికిత్సావేత్త రోగియొక్క రోగమును, దురలవాటులను, హీనస్థితిగతులను పోగొట్టసమర్థుడగును. ఇతరులయొక్క అవసరము లేకరోగి స్వయముగా చికిత్సించుకొను సామర్థ్యము సయితము [illegible] జికి గలిగియే యుండును.

మానసికచాంచల్యము నరికట్టి, శక్తివంతములును, అమోఘములును నగు గర్భితశక్తులను ప్రధానముగా జేయుట అన్నిజాతులలోని నాగరికులును అవలంబించుచున్న శాస్త్రీయవిధానము. కొలదిగాగాని పరిపక్వముగాగాని మనస్స్థితిలో నున్నప్పుడు మానసికముగాగాని నాడీసంబంధముగాగాని, తుదకు కండరసంబంధమైనట్టిగాని లోపముల నన్నిటిని పోవునట్లు భావనచేసి జన్మతః గలిగిన లోపముల నైనను వారింప సాధ్యమగును. పిచ్చి రాజగిన మానసికస్థితి, అమితత్వము, మనస్సు స్వాధీనములో లేకుండుటయు మొదలగునవియును పోగొట్టబడి, జ్ఞానాగ్ని రగుల్కొనును. తన్ను తానాదేశించుకొనుటయెట్లు? తన మనస్సుచే పరిచయమైన నొక దూరపు ప్రదేశముపై మనస్సును కేంద్రీకరించి, జీవుని అచ్చటనే నిలుపునది లేదా తా నున్న గదిలోనే ఒకప్రకాశవంతమగు వస్తువును జూచుచుండి ప్రాపంచికజ్ఞానము దాదాపుగా తగ్గిపోయిన తరువాత, నిన్ను అణచివేయుచున్న చెడుగుపోవుటకు భావన (will) చేయుము. అమోఘమైన ప్రాణశక్తిచే మొద్దుబారిన మోకాలునందు, చలనముగలుగు నట్లు భావించుము నీచమైన అసూయ, లోభితనము నీనుండి పోవునట్లు భావింపుము. నీకాశ్చర్యము గలుగునట్లు, నీ వద్భుతముగా బలయుతుడవును, ఘనుడవుగా నుజ్జీవితుడవయ్యెదవు. కొందఱు వైద్యులు దీనిని కేవలము తనసొమ్ముగా భావించి బాగుపడఁదలచి యున్నారు. అట్టివారిపై నాధారపడక యీ నూతనమైనట్టియు, ఆశ్చర్యకరమైనట్టియు శక్తిని పవిత్రముగా భావించి,

అభ్యసించి తత్ఫలితముల నందవలెను. మనస్సును, రోగమును మనము కోరినమార్గమునకు త్రిప్పుటకు "భావోదయ"మనున ది ఒకవీలయినట్టియు ప్రధానమైనట్టియు కర్మ. మనము భావింపకున్నను మానసికచాంచల్యమును నిరోధించినయెడల, కలుగవలసిన సత్ఫలితములు గలిగియే తీరును. ఏలనన మనస్సుతో బాధింపకున్నను వాంఛింపకున్నను, దైహిక, మానసిక శక్తుల యొక్క రాసాయని కానురాగవశమున గలిగియే తీరును. డాక్టర్ జె. ఆర్. న్యూటన్‌గారు 100మైళ్ళదూరములో ఆసన్న మరణాగానున్న శిశువునొక దానిని బ్రదికింపగలిగిరి. ఆదేశమును భావింపగలస్థితిలో నా శిశువు లేదు. ఆందోళనములో నున్న తల్లి యాఉపయోగకరమైన యుపచారము చేయదగిన స్థితిలో లేదు. అట్లుండియు నతనిభావన ఫలించినది. దేహస్థమైన ఆమ్లము (acid) తెలిసి తినినను తెలియక తినినను క్షారముతో సామరస్యమును బొందియేతీరును. దీనికి భావోదయముగాని, భావనగాని యవసరములేనట్లే విశ్వాసము లేకున్నను అసంఖ్యాకములగు వ్యాధులు కుదిరినవి. విశ్వాసవశమునను కొన్ని వ్యాధులు కుదురుట నిజమేయైనను, సమరసశక్తులు విశ్వసించినవానికిని, విశ్వసింపనివారికిని సయితము ఫలితము నొసంగియే తీరును. ఆదేశము = భావోదయము.

☞ రోగమువచ్చినప్పుడు సూర్యనమస్కారములు, నవగ్రహముల జపము, సప్తమసర్గసుందరకాండ పారాయణ చేయు మన యాచారముల కిది వింతగా దోప నగత్యము లేదు.

13. ఉదావర్ణోదకము:—ఉదారంగుగల గాజుకుప్పెలో పోసి యెండలో నుంచిన నీరు ఉదావర్ణోదక మన బఱుగు. దీనివలన నజీర్ణము మొదలగునవి తగ్గును.

14. ఉపదంశము:—అసహ్యాకరమగు, నీ వ్యాధియొక్క వినాశకర మగు గుణములు తరతరములుగా బాధించును. దీని దుష్ఫలముల సమూలముగా నాశనపరచుట ఆదిత్య పేటికా (solar sweat baths) స్నానములతో తప్ప సాధ్యము కాదు. దిగంబరముగా నుండు జాతులవారు, దట్టమైనవస్త్రుల ధరించి యుండువారికన్న రెట్టింపు మొదలు నాలుగురెట్ల బలము గలిగియుండి యితరదేశములనుండి తేఁబడిన తప్ప యుపదంశరహితులుగా నుందురు. బాగుగా చెమటగలుగు నట్లు ఆదిత్యపేటికతో నాతపస్నానము చేయుట ఈ వ్యాధికి చికిత్సామణియై యున్నది. ఏలనన:—పూతినాశక మగు సూర్యకాంతి విడి దేహముమీద పడినపుడు స్వేదవశ మున దేహమునందలి సూక్ష్మజీవులు (రోగపదార్థము) వెలు పటికి లాగివేయఁబడి సూర్యకిరణములచే నశింపజేయబడును. ఇతరచికిత్సాపద్ధతులవలనను రోగనివారణ కలిగినట్లు కాన్పింప వచ్చునుగాని తరువాత వత్సరములలో అసమగ్రమగు నివారణవలన రోగము తిరుగ కాన్పింప ననువైయుండును. నీలివర్ణోదకముచేత తఱచు దేహమును ప్రక్షాళన జేయుట మంచిది.

15. ఉద్రేకము:—నిగ్రహించు గడి గోడలకు నీలిరంగు

వేసినచో యుద్రేకమాశ్చర్యకరముగా తగ్గి, లేకుండ బోవును. లేదా (బయటినుంచివచ్చు వెలుతురున కడ్డముగా) కిటికీలో పెద్ద నీలిరంగద్దమునైన నుంచవచ్చును. పిచ్చిరాదగిన యుద్రేకము గలవారు పిచ్చిఆసుపత్రిలో నిట్లుచేసి 2, 3 దినములలో గుణపర్చం బడిరి. చికాకు గలిగినట్టియు, కోపదారులైనట్టియు శిశువులకు వారుండుగదికిటికీలో నీలియద్దము నుంచినయెడల ఆచికాకు కోపదారితనము మిక్కిలి తగ్గిపోవును.

16. ఉద్రేకము:—పడకగదిగోడలకు నీలిరంగు వేయుటయు, కిటికీలో పెద్దనీలిఅద్దమును అడ్డముగా నుంచుటయు చేసిన నీవ్యాధి యాశ్చర్యముగా గుణమగును. పిచ్చి ఆసుపత్రిలో యుద్రేకస్వభావము గలవారికి 1, 2 రోజులలో నిట్లు కుదిరెనది. నాడీవ్యాధియు, చిరాకును గలశిశువులకు, వారుండుగది కిటికీలో నీలియద్దము ద్వారా వెలుతురును ప్రసరింపజేయుటచే పైవ్యాధులు కుదురును.

17. ఎక్కిళ్లు:—జీర్ణాశయములను, యూపిరితిత్తులనువేరు చేయుదానికి డయాఫ్రమ్ అనిపేరు. దానియొక్క కుంచనము (Spasmodic action) వలన యెక్కిళ్ళు గలుగును. దీనికి జీర్ణాశయము ప్రధానకారణము. ఇట్టివి వైద్యులను సామాన్య సిద్ధాంతములు తెలియకుండుటవలన ప్రాణాపాయమును గలిగించినవి. ఇందును శీతశక్తిప్రధానముగా నుండును గనుక మిరియాలనీటిని వేడిగా నుండగా త్రాగించిన తగ్గును. లేదా వేడిపట్టీని, నాభిక యెగువను నాభిమీదను వేయవలెను. లేదా

వేడినీట కూర్చుండబెట్టవలెను. శ్వాసబాగుగా నాపియుంచి నను నిది తగ్గును.

18. కలరా—కామోద్రేకము—కుష్ఠువ్యాధి.

కలరా:—భేదు లగునట్టి ప్రథమదశలో 5 బిందువుల కర్పూర ద్రావకము (Spirits of camphor) పంచదారమీద యిచ్చుచుండవలెను (?) నీలి సీసాలోనినీరు లోని కిచ్చుచుండ వలెను. తిమ్మురులు ప్రవేశించి దేహోష్ణము తగ్గియున్నపుడు తాగగలిగినంత వేడినీటిని త్రాగించి శీతోదకము నీయవలసి నది. తిమ్మురులు, తీపులు నున్నచోట వేడినీటి సీసాలుగాని, వేడియిటుకలు గోతములోచుట్టిగాని యుంచవలసినది. వాంతి, భేదులను యెప్పటి కప్పుడు గోతిలోవేసి మూయవలసినది. మామూలు పద్ధతులకన్న యీ పైపద్ధతులు మిక్కిలి గుణతర ముగా నుండును.

19. కామోద్రేకము:—స్త్రీలలో - Nymphomania clitoris మొదలగు జననేంద్రియములందు కలిగిన వేడివలన నిదికలుగును. వొటనేసర్దుబాటు కానియెడల తీవ్రస్థితిగ లుగును. శ్యామోదకములో తడిపినగుడ్డ మలుగులకును పొత్తికడుపునకును రాత్రి పరుండబోవునపుడు చుట్టి పరుండు నది. ఇట్లు వరుసగా కొన్నిరాత్రులుజేసిన అత్యద్భుత సుగు ణములు గలుగును, శుక్లనష్టముసంభవలెనే 5,6 మడతల పొత్తి చుట్టుటయును మంచిదే. కామోద్రేకము - పురుషులలో

(Satyriasis) రాత్రిపరుండబోవునపుడు శ్యామోదకపు తడి పొత్తిని మలుగులకు కట్టిపరుండు చుండవలెను. వేడిచేయని పదార్థములను తినవలెను. గ్రుడ్లు మొ॥ నాహారములను మానవలసినది. ఆరుబయట పరిశ్రమచేయవలెను. పై తడి పొత్తివలన జననేంద్రియ సంబంధమైన నాడులు చల్లబడి కామోద్రేకము తగ్గిపోవును.

20. కుష్ఠు (Leprosy):— ఈ వ్యాధి ప్రపంచమందంతటను అసాధ్యముగా చెప్పఁబడినది. కాని హిందూదేశమున సూర్యకిరణ-చికిత్స ప్రచారమునకు తెచ్చిన జ్వరప్రసాదులు పీతోదకముచే నీ వ్యాధిని 6 మాసములలో కుదుర్పగలుగు చుండెను. రక్తోదకముతో జోడించి పీతోదకమువాడుచు, ఆదిత్య పేటికా స్నానములుగాని కేవలము ఆతపస్నానములుగాని చేయుచుండినచో నీ వ్యాధి యింకను త్వరగా నయమయ్యెడిది.

21. కండ్లకలక:—శ్యామోదకము అప్రతిమాన మైనది. రాత్రి పరుండబోవునపు డానీటితో తడిపిన తడిపొత్తిని కన్నుల మీదను కణతలమీదను వుంచవలెను. త్రవాత కుట్టుపనిగల వారు లాంతరుకు నీలిగాని ఆకుపచ్చగాని అద్దము అడ్డము పెట్టవలెను.

22. క్షయ:—ఆదిత్య పేటికయొక్కఁ వాడుకయొక్కఁలాభములు బాగుగా తెలిసివచ్చిన తరువాత దీని నక్కఁదాని తోనే గాకున్నను దాదాపు యిదే యీ దుర్భరవ్యాధిని

నిర్మూలింపగలదిగా నేర్పడవచ్చును. ఇంతవరకు శ్వాసాశయ వ్యాధుల గుదుర్చుటలో నెప్పుడు నిది యపజయమును బొంద లేదు. ఆసన్నమరణమైన వ్యాధిసయితమొకటి దీనిచే గుదిరినది. చర్మమువిూద పడిన సూర్యకిరణములు శిలీంధ్రముల నశింపజేసి స్వేదముఁ గలిగించి శుద్ధిచేయును. బలహీనత కలుగదు. ఇతరవిధములైన స్వేదప్రక్రియలవలన బలహీనత కలుగును. రక్తాభివృద్ధియము సరికట్టున దగుట నెత్తురుపడు నప్పుడు నీలికాంతి శ్వాసాశయములపైఁ బ్రసరింపజేయవలెను. రక్తాభివృద్ధియము లేనియెడల ఊదాకాంతిని వాడవలెను. రక్తాభివృద్ధియ మున్నప్పుడైనను వేడినీటి పాదస్నానము లత్యంత గుణయుతములు. యావత్తు దేహమును తుడలును అనగా పాదములు, చేతులు బాగుగా మర్దనచేయవలెను. కోకుగారి టీకారసమువలె మానవదేహనాశనముజేయక క్రుంగ్నును అపునట్టిది సూర్యకాంతి.

23. గండమాల:-చాల మొండివ్యాధి. పూర్తిగా ఆదిత్య పేటికతో నాతపస్నానము చేయుట, బహిరంగప్రదేశములో చేసిన వ్యాయామము, శుద్ధమైన ఆహారములవలన నిది గుదురును. ఉగురుగల పదార్థములు, పందిమాంసము, వెలుతురు రాని గదులలో నివసించుట, సూర్యకాంతి చొరని తేమ చీకటి గల లోయలలో వసించుట పూర్తిగ మానవలెను. సూర్యకాంతి చొరని కొండలోయలలో నివసించుటవలన స్విట్జర్లాండు మొదలగు దేశములలో కంఠముక్రింద పొడుగాటి [illegible]

(Goitre) పెరిగి, మానసిక మాంద్యమును (Cretivism) గలుగుచున్నది. శీతోదకముతోగాని, గ్రహం రొట్టెతోగాని, గ్లూటెన్ రొట్టెతోగాని (వీనిలో తవుడు చేరియుండును) ప్రేగులు చలించుచుండునట్లు చూడవలెను.

24. గర్భాశయచ్యుతి(prolapsus Uteri) గర్భాశయము నుండి కొలదినిమిషములు పైకిని వెలుపలికిని కాంత శక్తిగల చేతిని చలింపవలయును. గర్భాశయములోపలికిగాని వెలుపలికిగాని వంగిపోయినప్పుడు తగు నేర్పరిచేత స్థానమందుండునట్లు సరిచేయించి రెండు మూడు దినములు వెల్లకిల పరుండబెట్టవలెను. ఆ రోజులలో దినమునకు రెండుమూడులు కాంత శక్తిగలచేతితో గర్భాశయమునుండి వెలుపటికి చాలనము చేయవలయును. రోగియును తా నట్లే చేసుకొనుచుండవలెను. ఈ దుర్భరమగు వ్యాధి యిట్లు కుదర్ప సాధ్యమగును. నిద్దుర లేచుటతోడనే 5 నిమిషములున్నూ పరుండబోవునప్పుడు 5 నిమిషములున్నూ రోగి తనహస్తముతో గర్భాశయమునుండి వెలుపటికిన్ని పైకిన్ని హస్తచాలనము చేసుకొనుచుండవలయును.

25. గొప్పమానసిక రోగనివారణములు (The greatest mental cures):—కొద్దిగొప్ప మానసిక శక్తులుగల్గి సుస్థితత్వము గలిగిన వారికి మానసిక రోగనివారణము సిద్ధించబడినది. అనన్యసేవకతో చేసిన అతిపస్నానమువలన [illegible]

మలినమైన స్థితులయందు ఆశక్తి సున్నితముగా దేహములో ప్రవేశించి అందలి మాలిన్యమును కరగించివేయును. మానసికశాస్త్రము వేదాంతశాస్త్రము యీవిషయమున అద్భుతముగా సాయపడుచున్నవి. దేహమనోశక్తుల నశింపజేయు కామక్రోధలోభాద్యరిషడ్వర్గమును జయించి ప్రేమ భక్తి మొదలగు దేహమనోశక్తులకు సమతనుదార్ఢ్యము నొసంగగల సద్గుణములను పై శాస్త్రములు బోధించుచున్నవి.

26. గర్భధారణము, ప్రసవము:—నూతనజీవము లోకములోనికి రావలసియున్నప్పుడు తల్లి ముందుగా తొమ్మిది మాసములు మోయవలయును. ఆకాలమునం దామె ఆరోగ్యముగను ఆనందముగను నుండి ఉదాత్తమగు నాశయములను గలిగియుండవలయును. అనేకవిషయములయందు గర్భధారణము కలుగకుండునట్లు చేసికొనుటయే మేలుగా నుండును. కాని గర్భధారణమై ఒకజీవి గర్భస్థుడైన తరువాత గర్భస్రావమును కలిగించుకొనుట మాత్రము హత్యయే యగును. దుర్భరమగు నేరమే యగును. గర్భధారణమైన తరువాతకొన్ని వారములవరకును గర్భాశయము ననుసరించిన భాగమును దెబ్బటను మర్దనముగాని విద్యుత్కిరణములనుగాని తగులనీయరాదు. తరువాత మాత్రము మర్దనము అభ్యంగస్నానములవలన గర్భస్థమగు శిశువునందు నూతనచైతన్యము కలిగి శిశువునకు మానసికదౌర్బల్యము ఉన్మాదము మొదలగు వ్యాధులు కలుగకుండును. సుఖప్రసవము కలుగుటకు అనువగు దేహా

దార్ఢ్యము తల్లికి గలుగును. తక్కువ వస్త్రములు ధరించు చుండునట్టి, దిగంబరులు అయినట్టి వారియందు ప్రసవము బాధాకరమే గాదు. దీనికి కారణము ఆతపస్నానములే. అప్పు డప్పుడుచేసిన వేడినీటి కటిస్నానమువలనను, ధాతుకాంతశక్తి వలనను అద్భుతమగు సుగుణములు కలుగును. ఆరుబయటి సూర్యకాంతి, గాలి, చన్నీటి స్నానములు మొదలగువాని మహా గుణములను గ్రహించి అవలంబించిన శ్రీమతి యెలిజబేతు కేడిస్టేటన్ అనునామె ప్రసవము నందెట్టి బాధయు తాను పొందియుండలేదనియు ప్రసవించినదినముననే కుటుంబముతో గలిసి భుజించుచుంటిననియు ప్రకటించినది. గర్భధారణము కలిగిన తరువాత తేలికయగు వ్యాయామముచేయుచు ఏదిన మున కాదినము ప్రేగులయందు మలము నిలువకుండునట్లు చేసికొనుటయు చాలయుపయోగకరముగా నుండును. వేవిళ్ళ వలన వికారము మొదలగునవి గలిగినయెడల రెండు పెద్ద చెంచాల నీలివర్ణోదకమువలన మంచి మేలు గలుగును.

27. గ్రహణి:—అతిసారమునకువలెనే చికిత్స. నీలివర్ణో దకము ఆసనముగుండా ఎనిమాద్వారా ఎక్కించుటవలన రక్త ము పడుట ఆగిపోవును.

28. మొటిమలు:—ఆదిత్యపేటికతో చేసిన ఆతపస్నాన మువలన నద్భుతముగా నివి కుదురును. చిన్న చిన్నాటిలో నొక యువకుడు మొటిమలు, ఒంటితలనొప్పిచే చిరకాలము బాధ పడుచుండెను. ఆదిత్యపేటికాస్నానముచే నవి రెండును నిర్మూ లించినవి.

29. పుట్టుమచ్చలు:— అసహ్యాకరముగా కనబడు చున్నట్టి పుట్టుమచ్చలు, నీలిసీసాలోని నీటితో కలిపి నిమ్మ రసము చర్మములోని కినుకునట్లు రుద్దుటచే నవికనపడకుండా పోవును. ఇట్లు ఉదయము సాయంకాలములయందును రెండు మూడు దినములు చేయవలయును.

30. చేతులు బిరుసెక్కుట, పగులుట:— నీలిసీసాలోని నీటితో తరచుగా కడుగుచుండుటవలన చర్మమునందలి బిరుసుతనము పోయి మెత్తపడును.

31. పుంస్త్వ, రాచకురుపులు:— ఇవి కలుగుట నాడుల శక్తి తగ్గినదనియు, రక్తమునందు నూతనోజ్జీవము కలిగించు టవసరమనియు సూచించును. మర్దన ఆతపస్నానములు ఎక్కువగా పనిచేయును.

32. కంతులు, కాయలు, పులిపిరికాయలు:— భూతద్దముతో కాచుటచే నివి కరిగిపోవును. 1 మొదలు 5 నిమిషములవరకు భూతద్దముతో సూర్యకాంతిని కేంద్రీకరించిన నివి కరగిపోవును. అవసరమగునేని యిట్లుకొన్నితూరులు వరుసగా చేయవచ్చును. ఒక సూర్యకిరణచికిత్సకుడు 15 సెకనులు సూర్యకాంతిని ఇట్లు కేంద్రీకరించుటచే ఒక పులిపిరికాయ కరిగి పోయినది.

33. పాదములమీద కలిగెడి కాయ లేక కిణము:— (Corns) దీనికే కాల్యుక్కాస యని పేరు. [illegible]

పైభాగము మంగలికత్తితో కోసివేసి అడుగున మొద్దుగానున్న భాగమును భూతఅద్దముతో కాల్చిన కాలికమగు మాంద్యము నశించి చర్మము చైతన్యవంత మగును.

34. పుటుకలో కలిగిన చర్మవైవర్ణ్యము:— చర్మము నందు వివర్ణముగానుండి చర్మమునకు వికారముకలుగజేయునట్టి భాగములు భూతఅద్దముతో కాల్చినచో ఆవైవర్ణ్యము పోయి చర్మమునకు సహజమగు రంగు గలుగును. సూర్యకిరణము సున్ని తత్త్వములలోనిదగుటచే కాల్చుటచే గలిగినమచ్చ తోడనే మాసిపోవును. ఆవపిండితోవేసిన పట్టీవలన కన్న భూతఅద్దముతో కాల్చుటవలన కలుగు బాధయు తక్కువగానే యుండును. అగస్టన్ బారస్ట్సు అనువారు భూతఅద్దముతో ఇట్టి వైవర్ణ్యమును, కంతులను అనేకము కుదిర్చినారు. బ్యాబిట్ గారును, న్యూయార్కులోని కాంతశక్తి కళాశాలలోని స్నాతకులును ఇట్లే అనేకచికిత్సలు చేయుచుండిరి. చర్మవైవర్ణ్యము విద్యుత్ కిరణములకన్న, ఈభూతఅద్దముతో 10, 20 మారులు వడిగా కుదురును. భూతఅద్దమునకు ముందుగా నీలియద్దము నుంచి ప్రయోగించుటచే వైవర్ణ్యము తొలగుటగా క్రొత్త చర్మమునకు మార్దవము కలుగును.

35. చుండు:— పుర్రెను శుభ్రముగా కడిగి నీలవర్ణోదకముతో మర్దనచేసినమొదల వెంట్రుకలు రాలుట తగ్గి పెరుగ మొలవ నారంభించును. మధ్య మధ్య పసుపుపచ్చనీటి తోను సహితము మర్దనజేయువలసి యుండును. వెంట్రుకలు పుష్టి

భారి బిరుసెక్కియున్నప్పుడు నీలివర్ణోదకమువాడిన, గడ్డము మీది వెంట్రుకలు మెత్తపడి మృదువుగా నుండును.

**36.** చచ్చువాతము (Paralysis):—నాడులయందత్యంత మగు నిరోధము గలిగినప్పు డిది గలుగును. మెదడునం దొక భాగమున రక్తము గడ్డకట్టి నాడీనిరోధము గలిగించినప్పుడే రెండవవైపున నున్న దేహభాగము చచ్చుపడిపోవును. నాడీ నిరోధము గలిగినప్పుడు చైతన్యమును గలిగించు వైహాయస ములు సైతము ప్రసరింపమానును. శిరస్సుయొక్క వెనుక భాగమునను, ముచ్చిలిగుంటమీదను వడ తగిలినప్పుడు చేసి నట్లు వేడినీటిని పోయవలయును. ఇట్లు అనేకతూరులు చేయవలయును. మెడలమీద పచ్చని రంగుగల అద్దముతో కాంతిని ప్రసరింపజేయుచు ఆదిత్యపేటికాస్నానము జేయింప వలయును. జ్ఞాననాడులను కాంతశక్తిగల చేతితో పైకిని చల ననాడులయందలిచచ్చు క్రిందికిని చాలనముచేయుటచే తగ్గును. నీలివర్ణారోపితము వేసిన పాలపంచదార (Sugar of milk) వాడిన వేడితగ్గును. హోమియోపతిమందులలో టీ త్రాగుచం చాలో నాలుగోవంతు 1 × శక్తిగల నాభిమాత్రలు అరగ్లా సెడు నీలివర్ణోదకములో గలిపి ప్రతిరెండుగంటలకు పెద్దచం చాడు (Table—spoonful) చొప్పున యిచ్చుచుండవలయును. కాలికవ్యాధులయందు పీతవర్ణోదకము మిక్కిలి శ్రేష్ఠమైయు న్నది. వెన్నుపాములో క్రిందిభాగమున అవరోధము గలిగినప్పుడు పొత్తికడుపు, కాళ్లు చచ్చుపడిపోవును. నలుగులపై పచ్చని

సూర్యకాంతిని ప్రయోగించి కాంతశక్తిగల చేతితో సవ్యాప సవ్యముగా పాదములనుండి నడ్డివరకును నడ్డినుండి పాదముల వరకును సమగ్రముగా మర్దనచేయవలయును. ఉద్దీపనకరము లై రక్తమునందు చైతన్యముగలిగించునట్టి గోధుమ, ముల్లంగి, కొయ్యతోటకూర మొదలగుపదార్థములను భుజింపవలెను. ఒకే అవయవము చచ్చుపడినప్పుడు దానిని ఏకాంగవాత మందురు

**37.** జీర్ణాశయదాహము:- ప్రతి కొలది నిముసములకును ఒక్కొక్క గ్రుక్కెడు చొప్పున నీలివర్ణోదకము త్రాగు చుండినయెడల భయంకరమగు నీ వ్యాధి నయమగుచున్నది.

**38.** జీవనసరళిలో మార్పు:— జననేంద్రియములనుండి రక్తము తుదలకంట వ్యాపింపజేయుటకుగాను కాళ్ళు, పాద ములు, బాహువులు బాగుగా మర్దనజేయవలయును. ఇట్లు చేయనియెడల రక్తమంతయు స్వాభావికాభిసరణము లేకుం డుటవలన ఉదరమునందు కంతులుగా నిలిచిపోవును. లేదా జీర్ణాశయము, శ్వాసాశయములు- నీనియందు జేరిపోయి జీర్ణాశయ, శ్వాసాశయసంబంధములగు దుర్భరవ్యాధులను గలిగించును. ఈ జీవనసరళియందలి మార్పునే తత్వము స్థిరాయించుట యందురు. 35, 40 సంవత్సరముల మధ్య గలు గును. దిగంబరముగా ఎండలోను, గాలిలోను తిరుగునట్టి జాతులయందు రక్తము అత్యంతశుద్ధముగా నుండుటవలన స్త్రీలయందు రజోదర్శనము సాధారణముగా గలుగదు. ఆ వయస్సున రక్తము అత్యంతము మలినముగా

వలన ఆతపస్నానములవలన స్వేదము గలిగించి మాలిన్య విమోచనము గలిగించుకొనవలయును.

32. జ్వరము, ఆహ్నికజ్వరము:—మన మందువైద్యుల కీ వ్యాధియొక్క తత్వము బోధపడినట్లు కన్పింపదు. వివరించుట కిచ్చట కొంచెముగా ప్రయత్నించెదను. శ్లేష్మమునందలి శీతశక్తులు దేహమంతటను వ్యాపించి అచట సున్నితముగానున్న చర్మము నందలి స్పర్శగుణముచేత చలి గలుగును. శీతశక్తి లోకవయి పున విజృంభించుచుండ అంతరంగమున పిత్తకోశమునందలి వేడిమి అంతరవయవములను దహించివేయుచు అత్యంతమగు తాపమును దాహమును గలిగించును. చల్లదనము గల్గించు నట్టి పుల్లనివైన నిమ్మరసముతో గల్పిన నీరునారింజరసము మొదలగునవి త్రాగించుట మంచిది. శీతశక్తులు చర్మమున కంటి వ్యాపించి వెనుకకు మరలగానే అంతరంగముననున్న వేడిమి తుదలకంటి వ్యాపించి జ్వరమును కలిగించును. అప్పుడు అంతరంగమున శీతశక్తులు వ్యాపించి యుండును. వేడినీటితో చేస్చి కారపునీటిని త్రాగించిన (వేడినీరే చాలును. పు॥వెం॥రా॥) మంచి సుగుణము గలుగును. ఈమందును తీసికొనుట కింకొక మార్గము గలదు. రెండు చిన్న కారపుటుండలను ఒక్కొక్కటి రెండు గురి గింజలతూకముగలవాటిని సంపాదించి జ్వరము హెచ్చుగా నున్నప్పు డొకటియు, జ్వరము లేనప్పు డొకటియు పుచ్చుకొనవలయును. ఒక వైద్యుడు కేవలము మిరియముతో (మంది జ్వరపు రోగులకు స్వస్థత కలిగించెను. ఆ...

వాడుకొను ఈవస్తువు కై ్వనాకన్న అనేకరెట్లు నిరపాయమై నది. మర్దన, స్నానములు సహితము మిక్కిలి మేలయినవి. *చలిజ్వరమును కలిగించునను సూక్ష్మజీవులు పిత్తకోశము, ప్లీహము మాంద్యముగా నున్నప్పుడే వృద్ధిబొందును.

**40.** తిమ్మిర్లు:—చల్లని చలననాడులు క్రిందికి వ్యాపించుటకు బదులు పైకి వ్యాపించినప్పుడు తిమ్మిర్లు గలుగును. క్రిందికి రుద్దుటవలనను వేడినీటితోగాని ఆవిరితోగాని చికిత్స చేయుటవల్లను తగ్గును.

**41.** తెల్లసెగ:— ఉదావర్తోదకము యోనిగుండెలోనికెక్కించుటవలన గుదురును. మలబద్ధకము లేకుండ చేయవలయును. భరింపగలిగిన యెండలోను, గాలిలోను తిరుగుటవలన తత్వము బలపడును.

**42.** తెగ త్రాగుట త్రాగుబోతుతనము:— నేరములలో ఎక్కువభాగము దీనివలననే కలుగును. త్రాగుబోతులయొక్క సంతానము అరోగ్యులగుదురు. జీర్ణాశయమునుండి పైకిని వెలుపటికిని కాంతశక్తితో గూడిన హస్తచాలనము చేయవలయును. వీలుగానున్నప్పుడు ఆవిరిత్యా పేటికాస్నానములు చేయించినయెడల దేహమునందలి మాలిన్యములు బోయి వైపిన్యము గలుగును.

**43.** తొంటికలోపుంసు:— గొంతునుండి బుజములవైపునకును కంఠమునుండి పాదములవరకును హస్తచాలనము

చేయవలయును. వ్యాధి తీవ్రముగా నున్నప్పుడు శిశువునకు ప్రతి 15 నిముసములకున్ను చిన్న చంచాపట్టునంత నీలివర్ణోద కము నిచ్చుచుండవలయును. పాదములు కాళ్లు రుద్దుచుండవల యును. పాదములకు ఆవపిండి పట్టువేయవలెను.

44. నిద్రలేమి (Insomnia):—మెలకువతోనున్న కాల మునందు మెదడునందలి అణువులుకొన్ని దహించి వేయబడును. నిద్రాకాలమునందవి తిరిగి యుత్పత్తియై వృద్ధినొందును. కనుక మనస్సు పరిశాంతముగా నుండవలయు ననిన సుఖనిద్రయవ సరమే యగును. వెల్లకిల పరుండుటవలన నిద్రలో గురక యేర్పడును; కలలును కలుగును. జననేంద్రియములతో సంబం ధముగల నాడులు వేడియెక్కును. కాన వెల్లకిల పరుండుట కూడదు. పక్షుల రెక్కలయందలి మెత్తని తూలికలచే తయారు చేయబడిన పరుపులును మంచివికావు. (దూదిపరుపులును యిట్లే). భోజనము చేయుటతోడనే పరుండువారు కుడిచేతి మీదగాని పొట్టకుడిచేతిమీదగాని పరుండుట మిక్కిలి శ్రేష్ఠ మయినది. నిద్రలేమిచే బాధపడువారు యీక్రింది నియమ ముల ననుసరింపవలయును. రాత్రులయందు లెక్కువగా వ్రాయు టగాని చదువుటగాని మానవలయును. ప్రతిదినమును సాయం త్రమున వడిగా నడువవలయును. దేహముపైనుంచి క్రిందికి మర్దన చేయవలయును. ఎండలో చెమట కలుగునటు చేయు చుండవలయును. పరుండబోవు నప్పుడు నీలివర్ణోదకము త్రాగవలయును. పరుండబోవునపుడు వేడినీటి పాదస్నానము

చేయవలయును. నీరసముగాను ఆకలిగానున్నయెడల తేలిక యగు నాహారమును తినవలయును. విషయుతము లగు మత్తు పదార్థమును మాని వేయవలయును.

45. నిదురలో చికిత్స:—ఒకమనిషి నిద్రించుచున్నప్పుడు మానసిక సంబంధమగు వైహాయసము లందలి స్థూలతత్వము లును రక్తముయొక్క ఎక్కువ భాగమున్నూ నుదురునందుండి వెలువడియుండును. అప్పుడు మానసికశక్తి ఎక్కువగా పనిచేయును. నిద్రావశుడైయున్నవాని దేహమునందలి ఉద్దీపక శక్తులను దేహమునం దంతటను ప్రసరింపజేయునట్లు బలముగ భావనము చేయును. ఆశక్తి సున్నితమైవిద్యుచ్ఛక్తివలె వ్యాపించుచున్నట్లునీకుభావనయందుగోచరింపగలదు. ఈశక్తి నేరోగగ్రస్తమయినభాగమునకుమరలింపుము. లేదా దేహమునందు సౌమ్యతనుగలిగించి సుఖనిద్రగలుగునట్లు జేయుము. "ఆదేశచికిత్స" (Suggestive Theraphetics) అను పత్రికకు సంపాదకులుగా నున్నసిడ్నీ ఫ్లవర్ అను నాయన చికాగో నివాసి. ఈవిషయమయి అనేకమగు ఉపయోగకరమగు సూచనలు చేసియున్నాడు. పగటిపూట బోధించుటవలన కన్న రాత్రుల యందు నిద్రించుచున్న శిశువులగురించి భావనచేయుటవలన సత్ప్రవర్తన కలిగింపవచ్చు ననియు అది చిరకాలము నిలిచి యుండు ననియు వ్రాసినాడు.

46. న్యూమోనియా:—ఆదిత్యవేటకత్తో చికిత్స చేసిన యెడల దుర్భరము ప్రాణాపాయకరమునగు ఈవ్యాధి

ముగా కునురును. సూర్యకాంతి లేనప్పుడు ఆవిరిపట్టుట మంచిది. తుదలయందు చేయబడిన మర్దనమును మిక్కిలి గుణకరమైనదే. ఊపిరితిత్తులమీద నెప్పునును తీవ్రముగా రుద్దరాదు.

47. నాడీదాహము:—మలేరియావలనను, దుష్టరక్తమువలనను, అతిమాత్ర సంగమమువలనను, చుట్టసారాయి త్రాగుట మొదలగువానివలన నాడీశక్తి వ్యాపించు వాహికలు బలహీనమై అరికట్టబడును. అప్పుడు నాడీశక్తి అరికట్టిన మాలిన్యముల వెలువరింప ప్రయత్నించుటలో నాడులయందు తీవ్రమును, దుర్భరమును నగు బాధలు గలుగును. కణతలనుండి చెవులకుముందుగా దంతములలోనికి కొన్ని నాడులు వ్యాపించియుండును. చన్నీటిలో నీలివర్ణోదకములోనైన శ్రేష్ఠతరము. కుడి ఎడమచేతి వేళ్లను ముంచి కుడిచేతివేలికొనలు కుడిచెవి కెదురుగను, ఎడమచేతి వేలికొనలు ఎడమచెవి కెదురుగ నుంచి క్రిందికి చాలనము చేయవలయును. తరువాత శిరస్సునకు కుడి ఎడమభాగములయందు పైనుండి భుజములవరకును దిగువ చేతులవరకును చాలనము చేయవలయును. శాశ్వతనివారణోపాయముగ సూర్యకాంతిస్నానములను మర్దనచేయవలయును. మానసిక శక్తిని వృద్ధిపరచుకొని తీవ్రమగు భావనాబలముచే యీబాధలు లేకుండునట్లు సంకల్పించిన అత్యద్భుతమైన మేలు గలుగును.

48. నాడీక్షయము:-(Neurasthenia) దుఃఖము, ...

మొదలగువానివలన నాడులయందలి వైహాయసములు నశించి పోవును. దుష్ప్రవర్తనము, అమితసంగమము, పొగాకు వాడుట త్రాగుడు మొదలగునవియును, ఎప్పుడును యింటనే కూర్చుండు స్వభావమును మానవలయును. ఇందుకు బదులు అవసరమైనప్పుడు విశ్రాంతి తీసికొనుచు ఆరుబయట గాలిలో తగినంత దేహపరిశ్రమ చేయుచు ఆతపస్నానములు, మర్దన-వీని వలన నాడులయందలి శక్తిని వృద్ధిపరుచుచుండ వలయును. సముద్రమునకు సమీపముగానున్న ప్రదేశములలో నివసించుట వలనను నాడీశక్తి వృద్ధియగును. కావలసినంత నిద్రయును నాడీక్షయమును నివారింపగలిగినదే. సంకల్పబలముచేతను ఆత్మ విశ్వాసముచేతను సైతము నాడీక్షయము లేకుండపోవును.

49. నల్లమందువాడుట:—నల్లమందు వాడుటవలన మనస్సు పంకిలమై దేహశక్తులు నశించిపోవును. చిరకాలము నుండియు వచ్చుచున్న అజ్ఞానవశమున నల్లమందు ననేకులు వాడుచున్నారు. ఇందువలన అనేకవేలమంది యీ దురభ్యాసము వలన నశించిపోవుచున్నారు. బంగారము 100 X హోమియోపతిమందు. ఈమందును బఠాణీగింజంత మాత్రలు దినమునకు మూడు చొప్పున పుచ్చుకొనుచుండుటవలన ఈ దురలవాటు తగ్గిపోవును. హోమియోపతీమందులలోనే నల్లమందు ప్రాణాకము హెచ్చుశక్తిగల (High attenuation) దినమునకు 6 చుక్కలు పుచ్చుకొనుట మంచిది.

(డాక్టరు బాబిట్‌గారు హోమోపతిమందులు నిరుపద్రవకరమైన వని భావింతురు. వీరివలెనే హోమోపతీని ప్రకృతి వైద్యభాగములలో భావించువారు కీ॥ శే॥ హెన్రీ లిండ్లహార్, యమ్. డి. గారొకరు. కాని కేవలమగు ప్రకృతిశక్తులతో చికిత్సచేయువారు యిందునుయత్కించిదుపద్రవ మున్నదనియే భావింతురు. హోమోపతి మందులలో హెచ్చుశక్తి గలిగిన మందునం దెల్ల మందుభాగము సూక్ష్మాతిసూక్ష్మముగా నుండును. ఇట్లు 100 X అను గుర్తు గల శక్తిగలిగిన మందునందు మందుయొక్క భాగము 1 క్రింద 1 దీనితరువాత 100సున్నలు (one by one with 100 cyphers) పెట్టిన నెంత యగునో అంతమాత్రమే యుండును.

50. నంజు:— ఆదిత్యపేటిక కలదు గదా. ఊదారంగు అద్దముల కాంతి పైత్యకోశము, జీర్ణకోశము వీని పైబడునట్లు సూర్యున కెదురుగా కూర్చుండుటవలనను, సూర్యునికి వీపు చూపించి కూర్చొనునప్పుడు ఈరంగు మూత్రపిండములపై బడునట్లును కూర్చుండుటవలన నంజువ్యాధి కుదురును. ప్రపంచమునం దింతవరకును వాడుకలోనున్న చికిత్సలలోని కెల్ల యిదియే గుణతమమైనది. దేహమునందు వ్యాపించియున్న దుష్టమగు నీటిని యిదిసహజమగుమార్గమున వెలువరించి వేయును. మూత్రపిండములను పైత్యకోశములను సుజీవింపజేయుటవలన రోగకారణము నశించును. మర్దనమువలన మరింత మేలు కలుగును. ఉదరమునందు గలిగిన నంజునకు జలోదరమని పేరు.

మేదస్సునందు గలిగిన నంజునకు మేదోనంజని పేరు. ఇదే వృషణములందు గలిగిన బృహత్తని పేరు. ఇదే స్త్రీలయందు గలిగినప్పుడు గూద యందురు. బృహత్తు గలిగినపుడు తేపకు 15-20 నిముషముల చొప్పున వృషణములమీద ఎత్తురంగు అద్దమును కేంద్రీకరించుట, యిట్లే ఊదారంగు కుప్పెను కేంద్రీకరించుట, లేదా కేంద్రీకరోపకరణముతో నెఱుపు ఊదా రంగులను కేంద్రీకరించుట చేయవలసినది. శస్త్రము చేసి నీరు తీయుటలో దేహమున కవసరమైన రక్తముగూడ పోవును. మరియును శస్త్రము చేసిన పుండు కుళ్లెత్తును. కనుక శస్త్రము కూడదు.

51. నాట్యము:— రాత్రులయందు ప్రొద్దు పోకుండు నట్లును త్రాగుడుతో సంబంధము లేకుండను ఆప్తులతో కలిసి చేయు నాట్యములందు దేహమునందలి కాంతశక్తి పరివర్తనము నందును, ధాతుసంబంధమగు వైహాయసములు సున్నితమగు వాహికగల వగును. ఆనందప్రదమైన క్రీడయు నగును.

52. నడుము నొప్పి:— కాంతశక్తిగల వెచ్చనిచేతితో నాభి కెదురుగా వెనుకవైపున నడుముపై సవ్యాపసవ్యముగా హస్త చాలనము చేయవలయును. వేడినీటి కటిస్నానములు గాని బాధగలచోట వేడినీటి రబ్బరుతిత్తితో కాచుటగాని మంచిది.

53. నోటిపూత:— నీలివర్ణోదకము నోటితో పు...

తరుచుగా ఉమియుచుండ వలయును. ఇట్లు రెండు మూడుసార్లు చేసి చివరకు ఒకటి రెండు గుక్కలు నీలివర్ణోదకము త్రాగవలయును. బాధ యెక్కువగానున్న యెడల దినమున కిట్లు రెండు మూడు తూరులు చేయవలసియుండును. ఈచికిత్స చాలతూరులు గారడీవలె పనిచేసినది. నాలుక పగులుట, చిగురు వాచుట, మొదలగు వానియందు దొక్కతూరి పుక్కిలించుట వలననే మేలుగలుగు చున్నది.

54. పీతోదకము :— పసుపుపచ్చనిరంగుసీసాలో పోసి రెండుగంటలకు తక్కువ లేకుండునట్లు యెండలో నుంచిన నీటికి పీతోదక మని పేరు.

55. సైత్యజ్వరము:— చలిజ్వరమువలెనే ఉండును. ఇందు చలియును తీవ్రమగు జ్వరమును నుండును. చలిజ్వరమునకు వలెనే చికిత్స. జ్వరోష్ణము హెచ్చుగా నున్నప్పుడు దేహమునకు చన్నీటిగుడ్డలు చుట్టి వాటిపై గొంగళ్లు చుట్టవలయును. దాన చెమటగలుగును. హోమియోపతిలో తక్కువశక్తిగల నాభి మాత్ర నీలివర్ణోదకముతో కలిపి యివ్వవలయును. చిన్న చెంచెడు నాభిహోమియోపతి IX మాత్రలు ఒకగ్లాసెడు నీలివర్ణోదకములో చేర్చి ఆనీటిలో తేపకు ఒకపెద్ద చెంచాడు నీటిని ప్రతి గంటకును యిచ్చు చుండవలయును.

56. ప్రేగులయందు మంట :— బాలెంత జ్వరమునకు వలెనే చికిత్స. తరచుగా ఆదిత్యపేటికాస్నానములు చేయుచుం

డిన యెడల అంతరవయవములయందు మాలిన్యములు చేరవు.

57. పిచ్చి:—ఈ క్రింది కారణములచే పిచ్చిగలుగును:— జననేంద్రియములను దుర్వ్యయము చేయుట, నాడులయందు గలిగిన యుద్రేకము, సారాయి మొదలగు దుష్పానీయముల డ్రావుట, నెమ్మదియయినట్టియు గాఢమయినట్టియు నిద్ర లేకుండుట, విశ్రాంతి లేకుండుట, మనఃక్లేశము. అసూయ, ద్వేషము, గృహసంబంధములగు ఆపదలచే గలిగిన దుఃఖము, ఎప్పుడును తన ఆరోగ్యమును గూర్చినచింత - వీనివలన మెదడు నందు మార్పులుగలిగి పిచ్చిపుట్టును. దారిద్ర్యము, ఎడతెగని పనివలన గలిగిన దౌర్బల్యము మొదలగు వానివలనను నిద కలుగును. ఆతపస్నానములు, కాంతశక్తితో గూడిన మర్దన, వేదాంతము, వీనివలన నిద తగ్గును. వంశపారంపర్యముగా నున్న పిచ్చియయినను మానసిక చికిత్సచే కుదురును. పిచ్చిలో మతపిచ్చి యనున దింకొకటి కలదు. శుద్ధమగు మతము సుందరమై ఆనందదాయకమై యుండును. కాని భగవంతుడు నిరంకుశప్రభువనియు, ఈప్రజ లందరును నిత్యము/ప ఆతని కోపము నకు బలియగుచున్నట్లును, ప్రపంచమునం దంతయు దుఃఖము పిచ్చి, బాధ, రోగము మొదలగువానిచే నాతడు నిండించి నాడనియు, సుఖము, ఆనందము అందువలన మనకు లేకుండె ననియు మూఢవిశ్వాసము బోధించుచున్నది. 40 సంవత్సరములకు పూర్వము నేను (బ్యాబిట్) పిచ్చివైద్యశాలలను పరిశోధింపగా పిచ్చికి ముష్టిమైథునము మొదటి కారణమనియు మతపిచ్చి రెండవ కారణమనియు గనుగొంటిని. దేవా-

శక్తులను వినియోగించక తరచుగా మతకర్మలను సమ్మేయుం డుటవలన నిది కలుగును. తాను పాపము చేసితిననియు వానికి నిక నిష్కృతి పరిహారము లేదనియు భగవంతుడు తన్ను పాలింప డనియు భయపడుటవలన సైతము పిచ్చికలుగును. కాలక్రమ మున భగవంతుడు దయాసముద్రుడనియు పతితపావనుడనియు సర్వజీవహితంకరుడనియు, సర్వలోకైకసుఖదాతయనియు నమ్మక ప్రబలినతోలదినే ఈవ్యాధిపిచ్చి నశించిపోవును.

58. పండ్లు బిగియుట (Lock Jaw):— ప్రాణోపద్రవ కరమైనదని భావింపబడు నీ వ్యాధి యీక్రింది చికిత్సచే సుల భముగా కుదురును. 100 డిగ్రీల ( F. H. ) వేడిగల నీటిలో చెవికి క్రిందనున్న దేహభాగమంతయు నుండునట్లు కూర్చుండ బెట్టి నీటియొక్క వేడిమిని క్రమముగా పెంచుచుండవలయును. ఇట్లు 15 మొదలు 30 నిమిషములవరకు నీటిలో కూర్చుండ బెట్టి తడి తుడిచి క్రింది దవుడనుండి భుజములవరకును, క్రింది దవుడనుండి వెన్ను వెంటను హస్తచాలనము చేయవలయును. వేడినీటి సీసాలు పాదముల నంటునట్లుంచ వలయును. తలకు వేడి తగులకుండునట్లు కప్పియుంచి ఆదిత్యపేటికతో చేసిన ఆతపస్నానము వలన మిక్కిలి మేలు గలుగును

పక్షవాతము:—చచ్చువాతము చూడుడు.

59. పొగాకువాడుక :— ధనక్షయకరమైన అసహ్యకర మైన యీ దురలవాటు వలన రక్తము దంతములు, కన్నులు

దహించివేయబడును. హృదయవ్యాధులు కలుగును. తల నొప్పి, బలక్షీణత, క్షయ, పక్షపాతము, నాడీక్షయ; మొద లగు దుర్భర వ్యాధులు గలుగును. కాన దీనిని వదలివేయ వలయును. స్వయముగా వదలలేని యెడల మానసిక మూర్ఛ (Hypnotism) కలిగించుకుని అప్పుడు స్థిరసంకల్పుడ వగుము.

60. బొబ్బలజ్వరము :— ప్రాణోపద్రవకరమై : లక్షలాది భారతీయులను తనపాలబడను పెట్టుకొనిన యీదుష్టవ్యాధి మురికి బజారు దుర్వాయువులవలన గలుగుచున్నది. పండిత జ్వాల ప్రసాదులవారు నీలివర్ణోదకము ఆకుపచ్చ వర్ణోదకములచే వేలకొలది ప్రాణములను రక్షించినట్లు ప్రకటించినారు ఈ రెండువర్ణములు క్రుళ్ళుపుట్టకుండ నాపుటలో అతిగుణయుత ములైనవి బొంబాయిజిల్లాలో యీవ్యాధిని నివారించుటలో తుకారాం తాతియా యనువారు ప్రధానముగా పనిచేసిరి.

61. చెవుడు.—ఈవ్యాధి చెవియందుగలిగిన మంటలవలన గలుగును. నీలివర్ణోదకముతో చెవిని తటచుగా కడుగుచు నీలికాంతిని చెవిలోనికి ప్రసరింపజేయుటవలననే వ్యాధి కుదు రును. (అనవసరముగా చెవిలోనున్న గుబిలిని తీసివేయవల యును. రక్తాభిసరణము నందలి మాంద్యమువలన నీ వ్యాధి కలిగియున్న యెడల పీతవర్ణము నుపయోగింపవలసి యుండును.

62. మాంససంతానిక. (Diphtheria): — దీనినే సర్పిలం దురు, ఇది అంటువ్యాధి. కింకవాయువుకును డీనికిని యొక్క ?

చికిత్స చేయవలయును. కంఠమునుండి ఎడమవైపునను కుడి వైపునను భుజములవరకును హస్తచాలనము చేయవలయును. దేహముపైనుండి పాదములవరకును యిట్లే హస్తచాలనము చేయవలయును. వ్యాధి తీవ్రముగానున్నప్పుడు ప్రతి 15 నిమిషములకును ఒక అరవున్సు నీలివర్ణోదకము నిచ్చుచుండ వలయును. దేహము నంతయు రుద్దుటవలన చైతన్యమును కలిగించుచుండవలెను. పాదములు, కాళ్లు, ముఖ్యముగా రుద్దవలయును. పాదములకు ఆవపిండి పట్టువేయుట మంచిది. ఫ్రెడరిక్ యిం్ హామర్ అను డాక్టరుగారు చించినాటీవాస్తవ్యుడు. నీలివర్ణోదకము ఈవ్యాధిని నివారించుటలో అత్యంతగుణయుతమని చెప్పుచున్నారు. ఆదిత్యపేటికస్నానము మిక్కిలి మంచిది.

63. మలబద్ధకము:—పసుపువర్ణోదకముచే నిది అనేకవందలమందికి కుదర్చబడినది. ఇట్లు పసుపువర్ణోదకముచే కుదర్చబడిన మలబద్ధకములందు ప్రేగులు వదులైపోక యెప్పటివలె బిగువుగానే యుండును. నీరసముసైతము గలుగదు. మందులిచ్చినయెడల అట్లుగాక ప్రేగులు వదులైపోవును. అనేకౌషధములు వాడి ఫలముపొందని యనేకులకీ పీతవర్ణోదకముచే మేలు కలిగినది. దినమునకు 1 మొదలు 4 తూరులవరకు; తేపకు ఒక ఔన్సుచొప్పున పీతవర్ణోదకము నీయవలయును. ప్రేగులపై గుండ్రముగా రుద్దవలయును. పెద్ద ప్రేగువెంట కుడివైపున పైకిని ఎడమవైపున క్రిందికిని రుద్దవలయును.

పెద్దపేగులను చన్నీటిలో ఎనిమాచేసి కడుగవలయును. అది నమున నింకను 1 లేక 2 తూరులు నీరుపోవువరకును ఎక్కించి వదలివేయవలయును. ఇట్లు ఎనిమాచేసినప్పుడు నీరు కొలది దూరమేపోయినను అద్భుతమైన గుణము గలుగును.

64. మేధోమాంద్యము:—రక్త మధికముగా శిరస్సునకు వ్యాపించి మెదడునందలి బూడిదవర్ణపు తత్వమునందు న త్తి డిని కలుగజేసినప్పుడు స్పృహ తప్పిపోవును. అది వచ్చుముం దర ముఖము ఎఱ్ఱబడి మాంద్యము, నొప్పి, తలనొప్పి, మొద లగునవి కలుగును. కణతలు వత్తుటచేతను, మెడమీదను ముచ్చలగుంటలోను బలముగా రుద్దుటచేత రక్తపుపోటును తగ్గింపవచ్చును. శిరస్సున కెక్కిన రక్తమును భుజములు, బా హువులు, మలుగులు, కాళ్ళు, వీనిపై చరచుటవలన క్రిందికి దిగును. కణతలు నుదురు, వీనిపై మంచుగడ్డ రుద్దవలయును. శిర స్సునకు వెనుకవైపున నీచల్లదనము తగులనీయరాదు. వడ త గులుటకుచేయుచికిత్సయందువలె శిరస్సు వెనుకభాగము, ముచ్చలగుంట వీనిపై వేడినీటిని పోయవలయును. పాదములకు ఆవపిండి పట్టువేయుట, దేహముపైనుండి క్రిందికిరుద్దుట చాల అవసరము. ప్రమాదకరమగు నీస్థితి దాటినతరువాత రోగి ఆరుబయట వ్యాయామముచేయుట, ఆతపస్నానములు, మ ర్దన, మొదలగువానిచే రక్తమునందు క్రమాభిసరణమును గలి

మంత్రశాస్త్రము:— ఈ శాస్త్రముచే ననేకులవ్యాధులు నివారణమగుచున్నను నిం దద్భుతమగు నట్టియు, సున్నితమగు నట్టియు, ఆనందప్రదమగు నట్టియు సుగుణము లున్నను అది సౌష్ఠవమైన పద్ధతి కాదు. ఇందు దృశ్యమానమగు విశ్వము విస్మరింపబడు చున్నది. ఇది జర్మనీ మొదలగు దేశములలో గతశతాబ్దపు చివరభాగములలో ప్రబలి అందలి అనౌచిత్యము వెల్లడియయినది. సత్యశాస్త్రములయం దెల్ల ప్రకృతి పురుషుల (Matter and Spirit) యొక్క సమావేశ ముండనే యున్నది. చికాగోనివాసి యగు డాక్టరు డట్టర్ గారిట్లు చెప్పుచున్నారు:—"రోగమునకు కారణము సూక్ష్మజీవులుగాని ఏ యితర భౌతికపదార్థములుగాని గావు. మానసిక ఆత్మీయశక్తుల యందలి వికాసహీనతయే వీనికి కారణము. ప్రతివ్యాధియును రోగియొక్క మానసికఆత్మీయవ్యవస్థలయందలి లోపమువలన గలుగుచున్నట్లే మనము గుర్తింపగలము. పరులయొక్క మానసికాదిశక్తుల వలనను మనకు వ్యాధి గలుగవచ్చును." హాలేష్యోడబ్లియు, డెస్సర్ అనువారు యిట్లు చెప్పుచున్నారు:— 'మంత్రశాస్త్రదృష్టితో చూచినయెడల ప్రతివ్యాధికిని మనస్సే కారణము. కొన్నివిషయములను చెప్పిన తరువాత యీాపై చెప్పిన సిద్ధాంతములు నిరాధారము లని తేలగదు. కొన్నిటియందు పదార్థమును కొన్నిటియందు జీవమును ప్రధానకారణములుగా నుండినను

చేతనాచేతనములు కలిసియే పనిచేయుచుండు నని గ్రహింప గలము.'

### పదార్థమే ప్రధానకారణమైన విషయములు.

సారాయి త్రాగుటవలన 75 వ్యాధులు గలుగును త్రాగినవారు పిచ్చివారుగను పశువులుగను నగుదురు. పాద రసపు వాడుకవలన 51 వ్యాధులు గలుగును. మెదడుయొక్క ముందుభాగములో నొకపీలిక తీసివేసిన మనస్సే లేకుండ పోవును. పైత్యకోశము, జీర్ణాశయము, రోగగ్రస్తమైనప్పుడు పిచ్చి పుట్టును. మెదడుయొక్క వెనుకభాగమునం దొక్క పీలిక తీసివేసిన గ్రుడ్డితనము గలుగును, నైట్రస్ ఆక్సైడ్ వలన స్మృతి తప్పును. నల్లమందు మనస్సును భంగపరచి నిద్దురను మరణమును గలిగించును.

### జీవతత్త్వము మనస్సు ప్రధానముగానున్న విషయములు.

ఉద్రిక్తమగు మనస్సు గలిగిన తల్లిపాలయందు విష స్వభావము గలుగగా నా పాలను త్రాగిన శిశువు వెంటనే మరణించినది. ఎల్మరుగేట్సు అను పండితుడు తీవ్రమగు నుద్రేకము, మత్సరము, భయము, అసూయ - వీనివలన రక్తము తీవ్రవిషయముగా మారు ననియు అది కొలదిబిందువులు ఒక కుక్క ప్రాణమును తీయుటకు శక్తిగలిగి యుండు

ననియు బుుజువుపరిచి యున్నాను. దారిద్ర్యము, దుఃఖము - వీని వలన అజీర్ణము, పిచ్చి, గలుగ ననువై యుండును. భర్త్యాద్యుద్రేకములయందు పిచ్చి కలుగుట గలదు. దేవతో పాసనలయందు పిచ్చి కలుగుట కలదు. ప్రేమభావముగల వానియందలి నాడీశక్తి వృద్ధియై రక్తము సరళమై రూప మాకర్షనాత మగును. పరమేశ్వరునియందును పరమేశ్వరుని దివ్యావతారములయందును విశ్వాసము భక్తివలన మనస్సు నకు శాంతియును ఆనందమును గలిగి వ్యక్తియందు నూతన చైతన్యము గలుగును.

పై విషయములను అసంఖ్యాకములగు నితర విషయ ములను గమనించిన అజుస్వరూపమగు ప్రకృతి అణోరణీయ మైన పురుషునివలెనే సృష్టికారణమై యున్నది. భౌతికమగు ప్రకృతితో సక్రమముగ పురుషుని అనుబంధ ముండినపుడే జీవత్వము పరిపూర్ణమగునను విషయము వేరొకచో వివరించి యున్నాను. అసత్యముపై నాధారపరుపబడిన యెడల మంత్ర శాస్త్రము వైద్యశాస్త్రముగాక దయ్యపుశాస్త్ర మగును. జీవిత ములకు పరమార్థములగు ప్రేమ, శాంతి, సమత, పరాశక్తిపై విశ్వాసము, ప్రపన్నత - వీనిని బోధించినంతవరకును మంత్ర శాస్త్రముగాని భక్తిజ్ఞాన శాస్త్రములుగాని శిరసావహింపవలసి నవే. ప్రకృతి వైవసంబాధమైనదే! ఈవిషయము మరచుట వలన పరాశక్తియందలి ఆనందప్రదమును, సుందరమును నగు

నొక మహద్గుణమును, విస్మరించినట్లే యగును. ఆమహద్గుణ మును భావనచేయుచున్న యెడల మనయందలిశక్తి వృద్ధిమై తేజోవంత మగును. మంత్రశాస్త్రమువలన అత్యద్భుతములగు సుగుణములు గలుగు చుండినను సంకుచితమగు మార్గమున నడచుచుండిన యెడల కలుగవలసిన సుగుణము లన్నియు గలు గక మంత్రశాస్త్రముయొక్క సౌష్ఠవము తగ్గిపోవును. ఎడ్డీ అనునామె మంత్ర శాస్త్రమును ప్రచారము చేయుచున్నది. ఆమె 40 సంవత్సరముల నుండి తన రోగమును కుదుర్చుకొన లేక రోగిగానే యున్నది. పైత్యరోగులై నాడీదౌర్బల్యమువలన నేత్రములయొక్క స్థైర్యము తగ్గినవారు రోగమనునదే లేద నియు తమ కెట్టిరోగము గలిగినను నివారించుకొన గలమనియు చెప్పుచుందురు. పరిశుద్ధాంతరాత్మ గలిగి ప్రేమస్వరూపియై స్వార్థరహితుడై సూర్యకాంతి యందును వాయువునందును స్వేచ్ఛగా వర్తించునట్టి వానియందు ప్రకృతి పురుషులయొక్క సంపూర్ణవికాస ముండును. వానికి వ్యాధి యనునది గలుగదు.

మానవాభ్యుదయమునకై యుద్దేశింపబడిన యుద్యమ ములన్నియు న్యాయమైనవని బలపరచుటయందే నేను మిక్కిలి యాతురుడనై యున్నాను.

మానసిక చికిత్సా సంబంధములగు సిద్ధాంతముల యందు అజ్ఞానులైన వార్తాపత్రికలును, కువైద్యులుగ పరిగ ణించి సంతతము మానసిక చికిత్సకులను హింసింప సిద్ధముగ

నుండు మందువైద్యులును మానసిక చికిత్సకుల (మంత్రవేత్తల) ను సదా నిందింతురు. అట్టివారినుండి మానసిక చికిత్సకులను కాపాడుటయే నాలక్ష్యము. మందువైద్యులకన్న మంత్రవేత్తలే రోగనివారణ చేయుటలో యెక్కువ సమర్థులు. మానసిక చికిత్సకులకు సైతము తెలియని యొక సూక్ష్మ సిద్ధాంతమును వేను తెలుపవలసి యున్నది. సమర్థులగు చికిత్సకు లందరును తమ బోధనలతోపాటు ఒక కాంతవంతమగు తేజశ్చక్రము తమ రోగులపైకి వదలి వేయుచున్నారు. దృశ్యప్రపంచమునందు శక్తి చలన రూపముగా నీరు, వాయువు, ఆవిరి, మొదలగు వానిద్వారా వ్యాపించుట మన మెరుగుదుము. అదృశ్యశక్తులు సయితము మాసిద్ధాంతాను సారమే వ్యాపనము నొందును. మనస్సునందలి సంకల్పము సయితము ప్రవహించును. సున్నిత స్వభావముగల స్వీకరణ పరికరములపై సంకల్పములయొక్క చిత్రపటములను తీయవచ్చును. వానికిని రూపము, పరిమాణము, దృశ్యవస్తువులకు వలెనే యుండునని తెలుసుకొన గలము. సామర్థ్యముగల విశ్వాసచికిత్సకుడును సయితము తనసంకల్ప శక్తిని వదలును. ఉజ్జీవనకరమగు నాశక్తి రోగియొక్కమనస్సుపై ప్రతిఫలింపగనే వాని మనస్సునందు నూతన చైతన్యము, నుత్సాహము నుద్భవించును. సంరక్షకమగు నా విశ్వాసశక్తి సంరక్షణలో నున్న మనస్సునకు బలము సయితము వృద్ధి నొందును. స్వీయమగు మానసికశక్తులు దేహ మంతటను వ్యాపించి దేహము నవీనతను బొందును. రోగులతో నా సంబం

ధము వృద్ధియైన కొలదిని మాంత్రికుడు తన తేజశ్చక్రమును బహు దూరము వ్యాపింప జేయగలడు.

రోగి తరుచుగా నిట్లు చెప్పును:— "నిస్సహాయమగు నా ప్రయత్నములవలన నా కీసౌఖ్యము, బలము, చేకూర లేదు. సద్బుద్ధిగోపసిద్ధమై యున్న నొక దైవికశక్తిచే నా కివి చేకూరినవి. పరమపవిత్రులగు దేవతలు మనపై తమ కరుణారసము పెంపున అభ్యుదయముల వర్షింప సిద్ధముగా నున్నా" రను నమ్మికతో హృదయములను నిర్మలముగా నుంచి యభ్యుదయముల స్వీకరింప సిద్ధముగా నుండుటకన్న సహజమును ఆనందప్రదమును నగునదేది గలదు? పాఠకుడు మానసిక విద్యచే నంతటికార్యముల చేయగలుగుట సాధ్యమే యగుచో సర్వమునకును దానినే ప్రయోగింపక యితరము లేల యుప యోగింపవలయునని ప్రశ్నింపవచ్చును. మనస్సు చైతన్యమే సర్వమునకును కారణమను అసత్యసిద్ధాంతముపై చికిత్సా శాస్త్రమును నాధారపరచుట న్యాయము గాదు. పథ్యము రోగనివారకములగు నాహార పదార్థములు, వ్యాయామము, స్నానములు, యింతయేల, మానసేంద్రియములు మొదలగు రోగనివారకములగు ప్రధాన విషయములను విస్మరింపవలసి వచ్చును. మనసునందు భౌతికమగు మేధస్సును దైవికమగు చైతన్యమును కలసి యున్నవి. మనస్సుయొక్క గమనమునకు కారణమైన దైహికయానమునకు భౌతికయంత్రము యొక్క గతికి

నైతము కారణమై యున్నవి. అందును సున్నితమగు చైతన్యమును స్థూలమగు భౌతికతత్త్వమును గలదు. మానసిక చికిత్స వలన కుదరనప్పుడు భౌతిక చికిత్సలచే కుదురుట మీా రెరుగుదురుగదా ? దేహముపై సూర్యకాంతిని ప్రసరింపజేసిన యెడల ఆత్మశక్తి వృద్ధిబొందును. దేహముపై చేయబడిన మర్దనవలన దేహస్థమగు కేశనాళిక లుద్దీపింపబడి మానసికమగు చైతన్యము గలుగును. మృత్తికాస్నానమువలన దేహమునందలి స్థూలములగు మాలిన్యములు వెలువరింపబడును. కాన కేవలము మంత్రశాస్త్రమునందే మనదృష్టిని కేంద్రీకరింపరాదు. మంత్రశాస్త్రముతో కూడిన భౌతిక చికిత్సలు ఫలవంతములు. ఏకపక్షమగు చికిత్స యెప్పుడును అసమగ్రమే యగును. మానవుడు సృష్టియం దుత్తమపదార్థమై యున్నాడు. కనుక అతనియందు గలుగు లోపములను సరిజేయుటకైన చికిత్సలయందెల్ల సూక్ష్మతత్త్వములే ప్రధానముగా నుపయోగకరములై యుండును.

## మానవపొంతనము (Mating of Human beings)

స్నేహితులుగను, భార్యాభర్తలుగను మానవులను కూర్చుటలో కొన్ని ప్రధాన విషయములు గుర్తింపవలెను. ఇద్దరు ఒకేవిధమగు లావుగాని సన్నదనముగాని గలిగియుండరాదు. ఒకేరంగుగను నుండరాదు. ఒకేవిధమగు దేహనిర్మాణమును గాక యత్కించిద్భిన్నమై యుండవలెను. అభిరుచులును సమానముగా నుండవచ్చును. అందును కించిద్భిన్నత్వ

యుండవలెను. ఎఱ్ఱని దేహకాంతి గలవారియందు శుద్ధరక్తా
ధిక్యతయు, తెల్లని దేహకాంతిగల వారియందు మలినముగు
నీలివర్ణమగు రక్తాధిక్యతయు నుండును. ద్వివిధములగు రక్తము
నందన్యోన్యము రాసాయని కానురాగము గలుగు. అట్టివారి
యొక్క అన్యోన్యసాహచర్యమువలన వారియందలి శక్తి
యందును, బలారోగ్యములయందును సామరస్య మేర్పడి ఉభ
యులును బలారోగ్యశక్తివంతులు అగుదురు. వారే శయనము
నందు అనవరతము సన్నిహితు లగుచు రేని సామరస్యమునకు
సావకాశము లేకుండబోవును. అది క్రమముగా తగ్గిపోయి
చివరకు సామరస్యము కలుగదగిన భిన్నత లేకుండ బోవును.
భార్యాభర్త లిరువురును నెఱ్ఱని దేహకాంతిగలవా రగుచు
రేని వారియం దన్యోన్యత తక్కువగా నుండును. ఒకరి
సాహచర్యము నొకరు యిచ్ఛగింపక యుందురు. దురదృష్ట
వశమున నట్టివారికి సంతానము గలుగునేని వారు జ్వరాది
యుష్ణవ్యాధులచే బాధపడువారుగా నుండక తప్పదు.
అల్పాయుష్మంతులును నగుదురు. ఒకరు మాలసిక స్థూనము
మాత్రము గలిగి అత్యంతము సన్నగా నున్నప్పుడు వేరొకరు
తిండిపోతులై వర్తుల దేహముగలవారును నైనప్పుడు ఆసంబం
ధము అత్యంతము దుఃఖభాజనమై యుండును. దంపతులలో
నొకరు కండపుష్టియో. నరములపాటవమో గలవారుగా
నుండవలెను. అట్లుండుట, వారల కన్యోన్యము సుఖప్రదమై
యుండుటయే గాక సత్సంతాన ప్రాప్తికిని హేతువగును.

## కృత్రిమ రతి (Self abuse.)

స్త్రీలును, పురుషులును, సహజ విధమున గాక కృత్రిమ మగు విధముగా రతి చేయుటవలన వారి రక్తము నంపును, నాడులయందును, మనస్సునందును - యింతయేల ? సౌశీల్యము నందును న్యాయముగా నుండవలసిన సౌష్ఠవము నశించి భిన్నాభి న్నమగును. రక్తాదులు దుర్బలములై నాశనోన్ముఖమై యుండును. శుక్లనష్టమునకును, కామోద్రేకమునకును, చెప్పబడిన చికిత్సయే దీనికిని. కాంతశక్తిగల చేతిని చన్నీటిలోగాని నీలివర్ణోదకములోగాని ముంచి, వెన్నునుండి ముడ్డిపూసల మీదుగా పాదములవరకును చాలనము చేయవలెను. శిరస్సు వెనుక నుండి ముచ్చెలగుంట మీదుగా హస్తములవరకు యిట్లే చాలనము చేయవలెను. రక్తమిదివరకే మలినమై పోయి యుండినయెడల ఆదిత్యపేటికాస్నానముల వలన రక్తము శుద్ధమై, దేహసౌష్టవమును గలిగించును. మర్దనవలన నయిత మిట్టిఫలమే కలుగును. నిద్రాకాలమున వెన్నుపై పరుండిన యెడల రతి సంబంధమగు కలలు గలిగి వీర్యపాతమైపోవును. గాన రాత్రులయందు పరుండునపుడు వెన్నువైపున యేదైన కొయ్యముక్క కట్టుకొని పరుండవలెను. అప్పుడు నిద్రలో వెన్ను ప్రక్కపై నానినయెడల ఆకొయ్య పత్తుకొని నిద్రాభంగము గలిగించును. అప్పుడు తిరిగి బోర్లపరుండ వచ్చును.

## మశూచికము (Small pox)

మాంస సంతానికరోగమునకువలెనే దీనికిని చికిత్స మశూచికపు పుండ్లు దురదపుట్టుచుండుటకై వానిపై బియ్యపు పిండిగాని నాముగాని రాయవలెను. టీకాలు వేయుటవలన తాత్కాలికముగ రోగము రాకుండును. కాని ఆవిధానము వలన దేహములందు కుళ్ళు ప్రవేశపెట్టబడి అనేకములగు అసహ్యకరములగువ్యాధులు కలుగననువై యుండును. పాఠశాలలయందలి విద్యార్థులెల్లరును టీకాలు వేయించుకొనవలయునను శాసనమునందు క్షమార్హము గాని నిరంకుశత్వమున్నది. యూరోపు దేశము వర్ణ వైద్యము యొక్క ప్రాముఖ్యతను తెలిసికొనుట కారంభించుచున్నది. నార్వే మొదలగు దేశములందు దేహముపై యెర్రని కాంతిని ప్రయోగించి మసూచికమును నివారించుకొనుచున్నారు. దానికి కారణమిది. ఎర్రని రంగు ప్రయోగించుట వలన రక్తము సందుద్దీపన గలిగి యందలి మాలిన్యములు త్వరగా వెలువరింప బడును. నోటిలో మశూచికపు పొక్కులు కాన్పించిన యెడల నీలివర్ణోదకము పుక్కిలించి ఉమియుచుండవలయును. ☞ మశూచికము నందు ఆకుపసుపురంగు గుణయుతమైనది. ఎరుపు వాడుటలో నేర్పరితనముకావలెను. లేకున్న ప్రమాదము.

## యోనియందు మంట.

(Inflamation in the womb or vagina).

నీలి వర్ణోదకముతో భగవస్తి చేయవలెను.

శేరుల వేడినీటిలో అర్థ శేరు లేక శేరు నీలివర్ణోదకము కలుప వలెను. మలుగులు యెత్తుగానుంచి వ్రేళ్లకిల పరుండవలెను. యోనిలోని కా నీటిని బోనిచ్చి నెమ్మదిగా వదలిచేయవలెను. దీనివలన మంటలుతగ్గి రోగనివారణ మగును. యోనిలోని మృదుత్వముతగ్గియున్నప్పుడు యెంత వేడినీరు భరింపగలిగిన అంత వేడినీటితో వస్తిచేయ వలెను. నీలివర్ణోదకమునకు బదులు ఊదారంగునీటిని వాడవలెను.

## రక్తక్షయము.

రక్తమునందలి యెర్రకణములు తగ్గి దేహము పాలిపోవును. బలహీనత కలుగును. సులభముగా జీర్ణముకాదగిన ఆహారము, ఆరుబయట వ్యాయామము, యెండలో తిరుగుట తప్రాత్రాపి సాయంత్రపు యెండలో తిరుగుట, మర్దన వీనివలన రోగనివారణమగును. ధరించు దుస్తుల లోపలిపొర యెర్రని రంగుగుడ్డలుగా నుండవలెను. దాన చాల మేలు కలుగును.

రాచపుండు: —చర్మవ్యాధులు చూ.

## రక్తజ్వరము (Scarlet fever)

ఇందు దేహమంతయు యెర్రని పొక్కులు వత్తుగా పోసియుండును. ఇదియును పొంగుజ్వరములలోనిదే. పొంగులో నార్చి, దేహస్థమగు ప్రాణావయవములు చెడకుండుటకుగాను స్వేదకారములగు గొంగళిచుట్టలుగాని, ఆవిరిస్నానములుగాని చేయవలెను. ఇట్లు ప్రారంభమున దినమునకు 2 మారులుచేయు

వలెను. లేక పొంగులో నార్చినయెడల రక్తము విషీకరణమై చెవుడు, పిచ్చి మొదలగు వ్యాధులు గలుగును. గొంతునొప్పి యున్నయెడల నీలివర్ణోదకపు కట్టు కంఠమునకు కట్టవలెను. అందు తడిగుడ్డ గొంతు ముందుభాగముననే యుండవలెను. వెనుకభాగమున కూడదు. మలబద్ధకము లేకుండుటకు పీతవర్ణోదకము లోనికీయవలెను. మాంససంతానికయందు వలెనే లోనికి రక్తవర్ణోదకము నీయవలెను. ఇట్లు చేసిన సాధారణముగా ప్రాణాపాయమురాదు. మరియును తరువాత నెట్టిదుర్గుణముల నీయదు.

## విషవ్యతికరములు (Antidotes)

ఆహారములోని రోగనివారకశక్తులుగల పదార్థములను భుజించుటయేగాని మందులుగానే స్థూలములగు విషములుగాని, మందులుగాని వాడగూడదనియు, అవసరమగునేని సున్నితమగు హోమియోపతి మందులను వాడనచ్చుననియే మన సాంప్రదాయకుల నమ్మకము—కాని దురదృష్టవశమున స్థూలములగు విషములు దేహములో చేరియున్నప్పుడు వానిని సమరసపఱచి వెలువరించుట కనువగు స్థూలములును, త్వరగా పనిచేయునవియు నగు పదార్థములు వాడకతప్పదు. అవేవనగా:— ఆసిటిక్ యాసిడ్, గంధకద్రావకము, హైడ్రోక్లోరిక్ యాసిడ్, ఆక్సాలిక్ యాసిడ్, నైట్రిక్ యాసిడ్ మొదలగు ద్రావకములు త్రాగబడినపుడు వాని తీవ్రతను తగ్గింపగల సోడాబైకార్బొనేటు, మెగ్నీషియా, సీమసున్నము, పొడిచేసిన గోడముక్కలను

మొదలగు క్షారములను లోనికియ్యవలసియుండును. పొటాసు, సేలరేటస్, సోడా మొదలగు క్షారములు లోనికిచేరియున్నప్పుడు వానికి వ్యతికరములగు చిరక (Vinegar) నిమ్మరసము మొదలగు పుల్లనిపదార్థములను లోనికీయవలసియుండును. కరోసివ్ సబ్లిమేటు (Corrosive sublimate) పాషాణము, మైలతుత్తము, రాగిచిలుము మొదలగునవి తినబడినపుడు వానికి ప్రతీకారముగా గుడ్డులో తెల్లనిపదార్థము, పాలలోకలపినపిండి-పిసిని వాడవలెను. తీవ్రమగు విషయములందెల్ల ముఖవస్తి (Stomach Pump) చేయవలెను లేదా కక్కించవలెను.

## వడతగులుట (Sunstroke)

నుదురుపైనను కణతలపైనను తడిపొత్తిగాని, చన్నీరుగాని చల్లుచు, శిరఃపృష్ఠము, ముచ్చెలగుంట, మెడలమీదను, 105—115 డిగ్రి (F.H.) వేడిగల నీటిని పోయవలెను. బహు త్వరగను, చమత్కారముగను కుదురును.

## విషమజ్వరము (Typhoid fever).

'Bacilus Typhosus' అను సూక్ష్మజీవులు యీవ్యాధియందు ప్రచండవేగముతో వృద్ధిబొంది ప్రేవులు నిండును. అందు పురుగును కుళ్ళునుబుట్టించును. మలమునందు సయితమవి యుండును. గాస బౌన్లు చెరువులు మొదలగువానికి బహుదూరముగా మాత్రమే మలవిసర్జనము జరుగునట్లుంచవలెను. రోగి బలముగా నున్నయెడల ఆదిత్యశీతికాస్నానము

లు మంచిది. లేదా దినమునకు 1,2 తూరులు గోంగళి చుట్టలతో స్వేదము కలిగించుకొనుచుండవలెను. కొంతశక్తితో కూడిన మర్దనమువలన చాలమేలు కలుగును. ద్రవపదార్థము లనుమాత్రమే లోనికీయవలయును. పైత్య జ్వరములకు వలెనే చికిత్స. మ్యూనిచ్ లో ఒక ఆసుపత్రిలో స్నానముల విధానము వలన, టైఫాయిడు వ్యాధివలన మరణించువారి సంఖ్య వేయింటికి 207 నుండి 27 వరకు తగ్గింపగలిగిరి. అదే పూర్వ సాంప్రదాయమునందలి చికిత్సచే 1200 మందికి చికిత్సచేయగా, రోగము కలిగినతరువాత 5 దినములు గడచినతరువాత చికిత్సచేయబడినవారెల్లరు మరణించిరి. ఈవిషయము Balneology అను పత్రికలో డాక్టరు సైమర్ బారుక్ అనువారు ప్రచురించిరి.

## శైత్యము.

దేహమునందు సరియైన దార్ఢ్యములేక బహిర్గతము కావలసిన మాలిన్యములు అంతర్ముఖమై ప్రాణానయవములలో చేరినపుడు జలుబు గలుగును. వడిగా నడచుటవలన మాలిన్యములు బహిర్ముఖమై స్వేదముగా వెడలిపోవును.

## శక్తితత్వము (Law of power)

శక్తులు సున్నితములు. అణురూపములైన కొలదిని వాని యొక్క బలము వృద్ధిబొందుచుండును. వానివలన నేర్పడిన గుణములు సుస్థిరముగా నుండును. ఒకటేమి: వానియందు చొరబారు స్వభావము (Penetration) అధికముగానుండి, వాని ప్రయోగమున ఫలితములు నాడీకేంద్రమునకు సూటిగా

చొచ్చుకొనిపోయి అంతటి అధికముగా శక్తితత్త్వములోనికి జొరబడును. రెండు; రోగకారణమగు దేహస్థమగు జీర్ణాది వ్యవస్థలనే చక్కబఱచి బలపఱచును. గాన యీసున్నిత శక్తులచే చేయఁబడిన చికిత్సయందు, చికిత్సా స్వభావమగు రోగ నివారణమును స్థిరముగనే యుండును. మూడు; నాడులు, రక్తనాళములు, కండరములవెంట మృదువుగా వ్యాపించును గాన, యెట్టి యపాయమును గలుగదు. కాన యీచికిత్స ఉపద్రవకరముగాక క్షేమతమమైనది. నాలుగు; కత్తికోతలు, పట్టీలు, కాల్పులు, వాంతిభేదికౌషధములు, రక్తమోచక క్రియలు మొదలగు నితరవైద్యసాంప్రదాయమునకు జెందినవానితో మనవైద్యమును బోల్చిచూచినచో నిదియే సుఖతమమైనదనియు గుర్తింపఁగలరు. ఆరు; ఈచికిత్స మానసికాత్మియోన్నతిం గలిగించును.

## శుక్లనష్టము (Spermotorrhea)

ప్రాణాగ్నినే అనుత్క్షణమును నశింపఁ జేయునదియు, పుంస్త్వహానినిఁ గలిగించునదియు, మానసికశక్తులను ఆజ్ఞాశక్తిని నశింపజేయునదియునగు నీవ్యాధికి వెంటనే చికిత్స చేయవలయును. ఈక్రింద పేర్కొనినవిధానము శ్రేష్ఠమైనది. నీలి వర్ణోదకములో తడిపిన వస్త్రము నాభికి సూటిగా మలుగుల పైనవేసి దానిపైన ఒక తుండుగుడ్డ కట్టివేయవలెను. ఇట్లుచాల దినములు ప్రతి రాత్రియును జేయుచుండవలెను. ఆరుబయట గాలిలో వ్యాయామము చేయవలెను. ప్రతి[illegible]యును మలము

నిలువకుండ వెడలిపోవునట్లు చేయుచుండవలెను. వెల్లకిల పరుం డుట మానవలెను. ఆదిత్యపేటికయందు, మలుగులపై నీలిగాని ఆకుపసుపుగాని కాంతిపడునట్లు కూర్చుండిన యెడల దేహతత్వ ము బలపడి, రోగనివారణ మగును. దేహమర్దన చేసినయెడల యెక్కువ మేలు గలుగును.

## శ్యామోదకము (Cereleo)

నీలిసీసాలో పోసి బిరడా వేసిన తరువాత యెండలో నుంచిన నీరునకు శ్యామోదకమనిపేరు. ఆనీరు దేహమునందలి వేడిని తగ్గించి, నాడులను చల్లబఱచును. మంటను తగ్గించును. యీడ్పురోగమును గుదుర్చును. కలరా, అతిసారము, మశూచి మొదలగు వ్యాధులను గుదుర్చును.

## శూల - (Colic or sour Stomach).

నీలివర్ణోదకముచే తప్పక కుదురును. ప్రతికొలది నిమి షములను ఒకతూరి చొప్పున గుక్కెడు గుక్కెడు చొప్పున త్రాగవలెను.

శిలా పైత్యము - (Gallstones) దేహమర్దన, ఆతప స్నానములవలన పైత్యకోశముయొక్క అక్రమగతి సరిచేయబడి రోగ నివారణ మగును.

సంధులు, కండరములు, సుషుప్త శక్తినాళములు:—

వీనియందు గలిగిన బలహీనతను నాభినుండి యెగువ వైపునకు కాంతశక్తిగల హస్తచాలనము చేయువలెను.

చిగురుటచేత గలిగిన బాధకుని గుర్తీ చేయవలెనా, పేలు చూచి నీలివర్ణోదకపు పొత్తిని అంగముపై నుంచవలెను. సమయమునందలి దౌర్బల్యమునను మందముపంకేను కాకుండ పైకిని, వెలుపటికిని కాంతశక్తిగల హస్తచాలనము చేయవలెను. అనులోమ విలోమ చాలనములు సయితము చేయవచ్చును.

సారాయి (Alchol) మతిని చెడగొట్టును గాన మానవలెను. అతిపానముకవలన పిచ్చిపుట్టును.

## స్తనముల సౌష్ఠవము (Development of bosom)

స్తనము చుట్టును గుండ్రముగా హస్తచాలనము చేయవలెను. అంతరమందలి గ్రంధులు కరగిపోయి, క్రొత్తకండపట్టి స్తనములు సౌష్ఠవములై సౌందర్యమును వృద్ధిబఱచును.

## స్వేదాధిక్యము (Excessive sweating-Hyperidrosis)

చర్మమును శ్యామోదకముచే కడుగవలెను. దీనివలన రోమకూపములు ముడుచుకొనును. పూతినాశకమైన దగుట వలన క్రుళ్లు పుట్టనీయకుండ ఆపును. సూక్ష్మజీవులను నశింపు జేయును. చర్మము మిక్కిలిగా పనిచేయనప్పుడు రుద్దుటయు, స్వేదమును గలిగించు ప్రక్రియలను జేయవలెను.

## సున్నితశక్తులు (Fine Forces)

### కాంతశక్తితో గూడిన స్పర్శన (Magnetic massage)

సూర్యకిరణములు, రంగులశక్తులు, విద్యుచ్ఛక్తి, హోమియోపతి, మానసిక వైద్యము యివి సున్నితశక్తులతో చేయు విధానము లందలివి. ఆవిరి, నీరు, యివి స్వయముగా సున్నితశక్తులు గాకున్నను, వానిని వ్యాపింప జేయుటకు నిలగు వాహనములై యున్నవి

## సింధువ్యాధి (Sea sickness).

సముద్రముమీద ప్రయాణము చేయునప్పుడు కొందరికి వాంతులు, భేదులు గలుగును. దీనికి సింధువ్యాధి యని పేరు. నీలివర్ణోదకము వాడిన యిద్దరికిని కుదిరినది. (W. E.) పార్కర్ అను వారు సముద్రమును 2 తూరులు తరించిరి. వారు వాడి ఔషధ శ్రేష్ఠమని, శ్యామోదకము నతడు పేర్కొనినాడు. కొన్ని స్థితులలో యే వైద్యమును నిష్ఫలమే యగును.

## సామరస్యము (Law of Harmony).

వ్యతిరేక శక్తులను సామరస్య పఱచుటకు మృదువగు కలయిక గావలయును. ఇదియే సృష్టియందును; రాసాయనికానురాగము నందును గలదు. రోగము యేకపక్షమైనది. ఉష్ణశక్తులు అధికమైనప్పుడు జ్వరము, తాపము, మంటలు గలుగును. శీతశక్తులు అధికమైనపుడు యీడ్పు, నొప్పులు, చచ్చు గలుగును. ఇందు మొదటి వానికి శీతశక్తుల వలనను రెండవ రకమునకు ఉష్ణశక్తుల వలనను సామరస్యము గలిగి రోగనివారణ మగును. విశ్వమునందలి శక్తులన్నియు ఉష్ణ

శక్తు లనియు, శీతశక్తులనియు రెండు విధములుగా నుండును. ఉష్ణశక్తులు వ్యాకోచమును, వేడిమిని గలిగించును. శీత శక్తులు సంకోచమును గలిగించును. స్థూలముగు శీతశక్తివలన చల్లదనము గలుగును. ఈ రెండు శక్తులును సమరసమును బొందినపుడే ఆరోగ్య మొదవును.

## హృదయ దౌర్బల్యము.

## (Palpitation of the Heart, Angina Pectoris.)

హృదయ నాడులయందు, తీపు, మొదలగు తరుణము లగు బాధలన్నియు నీలికాంతిని హృదయభాగమునను, జీర్ణా శయము పైభాగమువరకును బ్రసరింపజేయును. ఇట్లు ప్రతితూరియును 15 నిమిషములుగాని అంతకు కొంచెము యెక్కువ సేపుగాని బ్రసరింపజేయవలెను. పొగాకు, సారాయి బలమైన టీ, కాఫీల వినియోగము, అతిమాత్రమగు సంగ మము, జననేంద్రియములందలి దోషము వీటివలన హృదయ దౌర్బల్య మేర్పడును. శ్వాసాశయములు సరిగా పనిజేయక రక్తాభిసరణము అరికట్టబడుచుండిన యెడల మేడనెక్కుట, ఉద్రేకము మొదలగు వానిని మానవలెను. లేకున్న ప్రమాద మగును.

## క్షయ (Pthisis).

ఆదిత్య పేటికతో చేయబడిన ఆతప స్నానమువలన మిక్కిలి మేలు గలుగును. దానియొక్క సత్ఫలితములు జ్వాగ్ర

త్తిగా గుర్తింప గలిగిన కేవలమిదే యుత్తమోత్తమ చికిత్స కాకున్నను ఉత్తమ చికిత్సలలో నొకటిగానైన పరిగణింప వచ్చును. ఇంతవరకు వాడినంతలో శ్వాసాశయ వ్యాధులం దీ చికిత్స వ్యర్థముగాలేదు. ఆసన్న మరణముగానున్న రోగి కొకరికిది అత్యంతముగు మేలుజేసినది. దేహముమీద సూర్య కాంతినిట్లు ప్రయోగించుటవలన రోగ కారణములని చెప్ప బడు సూక్ష్మజీవులు నశించి స్వేదము కలుగుట ద్వారా దేహ ము నందలి మాలిన్యములు వెడలిపోవును. ఆవిరి మొదలగు స్వేద ప్రక్రియలందువలె నింత దౌర్బల్యము గలుగదు. రక్తా భిష్యంద మేర్పడిన యెడల రక్తాభిష్యాదముల నరికట్ట సమర్థ మైన నీలికాంతిని శ్వాసాశయములపై ప్రసరింపఁ జేయవలెను. సామాన్యముగా ఊదారంగు శ్వాసాశయములపై ప్రసరింపఁ జేయవలెను. రక్తాభిష్యంద మేర్పడినపుడు వేడినీటి పాద స్నానము జేయవలెను. దేహముయొక్క తుడలను, దేహ మంతటిని మర్దన జేయవలెను. సూర్యకాంతి పూర్తి నాశక మైనదైనను ప్రాణమున కెట్టి యుపద్రవమును గలిగింపదు. కోకుగారి క్షయటీకాల రసమన్ననో ప్రాణోపద్రవమును గలిగించును.

సంపూర్ణము.



నగ్నవైద్యమునందు ప్రవీణతగాంచ నిచ్ఛించు వారెల్ల రీ దిగువ గ్రంథములను ప్రకృతి సంపుటములను జదువ వలసి యుందురు.

1. నగ్నచికిత్స. డా॥ ఆస్టరన్ను ఈవ్స్‌గారి గ్రంథమునకు అనువాదము. వెల రు 0-6-0 0-5-0.

2. సూర్యకిరణచికిత్స. పండిత జ్వాలా ప్రసాదుగారి గ్రంథమున కనువాదము. వెల రు 0-12-0 0-10-0.

3. ప్రౌఢ ప్రభాకరము. డా॥ ఇ. డి. బ్యాబిట్టుగారి గ్రంథమున కనువాదము. వెల రు 2-0-0 1-8-0.

# తొట్టి వైద్యము

ఇందులో కూనేగారి "అభినవ వైద్యశాస్త్రము, ముఖ వైఖరీవిద్య, రోగారోగ్య వివేకము, శిశుపోషణము" అను గ్రంథములలోని ముఖ్య విషయములన్నియు గలవు. ఇందులో 70 పటములు 4 భాగములు, 34 అధ్యాయములు, 6 అనుబంధములు వెరశి 400 పుటలు గలవు. గ్లేజు కాగితము, చక్కని బైండు. ప్రకృతి చందాదారులకు వెల రు 2-8-0 మాత్రమే. ఇతరులకు రు 3-0-0.



